శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీమాత నిస్సీమ మహిమ

- 2 -

## శ్రీ లలితా సహస్రనామంలోని కొన్ని నామాల తాత్త్వికచింతన

**(Philosophical Concepts in Sri Lalita Sahasranamam)**



నండూరి సూర్య సత్య నారాయణ

**May 2014**





శ్రీ శివా శివ శక్త్యైక్య రూపిణీ లలితాంబికా!

# మనవి

భారతీయ శాస్త్రాలన్నింటిలోను ఉన్న అన్ని విశేషాలకి ఒక విషయసూచిక తయారుచేసి దాన్ని అనుష్టుప్ ఛన్దస్సులో వ్రాస్తే అది శ్రీ లలితా సహస్ర నామం అవుతుందని నేను భావిస్తాను. ఈ నామాలలో ఉన్న కవరేజ్ అంత గొప్ప విశాలమయినది. షడ్దర్శనాలు, శ్రుతులు, స్మృతులు, వేదాన్తోపనిషత్తులు, సాంప్రదాయాలు, మన్త్ర-యన్త్ర-తన్త్ర ఉపాసన విధానాలు, సాత్త్వికోపాసన, వగైరా అన్నీ ఈ నామాలలో ప్రతిబింబిస్తాయి.

ఇదివరలో "శ్రీమాత నిస్సీమ మహిమ" అని, అమ్మవారి కొన్ని నామాలకి లౌకికభావ వివరణగా తొమ్మిది వ్యాసాలతో ఒక చిన్న పుస్తకం వ్రాయటం జరిగింది. మరికొన్ని నామాలకి కూడా వ్యాసాలు వ్రాయమని కొందరు ఆదేశించగా చేసిన యజ్ఞం, ఈ రెండవ పుస్తకం "శ్రీమాత నిస్సీమ మహిమ - 2". ఇందులో మరో తొమ్మిది వ్యాసాలు పూర్తిగా తాత్త్విక దృష్టితో వ్రాయటం జరిగింది. సామాన్యులకి మరో సామాన్యుడు మడి కట్టని వాడుక భాషలో వ్రాసిన పుస్తకం ఇది.

గతంలో వ్రాసిన పుస్తకం గురించి బ్రహ్మశ్రీ ఇనుగంటి ఉమా రామారావు గారు కొన్ని సలహాలిచ్చారు. వారికి నా కృతజ్ఞతలు. బ్రహ్మశ్రీ కందుకూరి సత్య సూర్యనారాయణ మూర్తి గారు ఇప్పటి ఈ పుస్తకం మాన్యూస్క్రిప్ట్ చదివి అక్షరాలు, పదాలు గూడా కరెక్ట్ చేశారు. ముఖ్యంగా ఏడవ అధ్యాయంలో వైశేషిక "సమవాయ" భావాన్ని నిర్వచించే సందర్భంలో రాంగ్ ట్రాక్ ఎక్కేసిన నా రాతని సరైన మార్గంలోకి మళ్ళించారు. వారికి పునఃపునః కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను. జల్లించగా జల్లించగా కూడా ఇంకా బోలెడు తప్పులు మిగిలే ఉంటాయి. ఇదివరలోలాగానే నన్ను దయతో క్షమించి వాటిని తెలియ చేయవలసిందిగా అభిజ్ఞులకు విన్నవించుకుంటున్నాను.





ఆప్తమిత్రుడు శ్రీ చాగంటి కృష్ణారావు అందచేసిన హెల్ప్ చెప్పటం కష్టం. బొమ్మ అతనిచ్చినదే. భార్య హంసవతి, సోదరుడు శరత్ కూడా చాలా సహాయం చేశారు. వీరందరికి కృతజ్ఞతలు. అందరినీ, వీరందరినీ, ఆశీర్వదించవలసిందిగా అమ్మవారికి నా మనవి.

శ్రీ లలితా సహస్రంలోని నామాలు, వ్యాసాలలో **బోల్డ్ ప్రింట్**లో చూపించబడ్డాయి.

నండూరి సూర్య సత్య నారాయణ
(విజయ, ఫాల్గుణ శుక్ల తదియ,
03-03-2014, బెంగళూరు)

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీమాత నిస్సీమ మహిమ

## - 2 -

నండూరి సూర్య సత్య నారాయణ

విషయ సూచిక

**Sri Lalita Sahasram**

1. శ్రీ పంచకోశాంతరస్థితా, శ్రీ లలితాంబికా
2. శ్రీ స్వాత్మానంద లవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః, శ్రీ లలితాంబికా
3. శ్రీ బహురూపా, భూమరూపా, శ్రీ లలితాంబికా
4. శ్రీ పరంజ్యోతిః, శ్రీ లలితాంబికా
5. శ్రీ సర్వోపనిషదుద్ఘుష్టా, శ్రీ లలితాంబికా
6. శ్రీ శ్రుతిస్స్మృతిః, శ్రీ లలితాంబికా
7. శ్రీ భావా~భావ వివర్జితా, శ్రీ లలితాంబికా
8. శ్రీ కార్యకారణనిర్ముక్తా, సృష్టికర్త్రీ, శ్రీ లలితాంబికా
9. శ్రీ పుణ్యా~పుణ్యఫలప్రదా, శ్రీ లలితాంబికా





*శ్రీ మహాగణపతయే నమః*

*ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ మాత్రే నమః*

*సిందూరారుణ విగ్రహాం త్రినయనాం మాణిక్య మౌళిస్ఫుర*
*త్తారానాయక శేఖరాం స్మితముఖీం ఆపీనవక్షోరుహాం*
*పాణిభ్యాం అలిపూర్ణరత్నచషకం రక్తోత్పలం బిభ్రతీం*
*సౌమ్యాం రక్తఘటస్థ రక్తచరణాం ధ్యాయేత్ పరాం అంబికాం ।*

*అరుణాం కరుణాతరంగితాక్షీం ధృతపాశాంకుశ పుష్పబాణచాపాం*
*అణిమాదిభిరావృతాం మయూఖైః అహమిత్యేవ విభావయే భవానీం ।*

*ధ్యాయేత్ పద్మాసనస్థాం వికసితవదనాం పద్మపత్రాయతాక్షీం*
*హేమాభాం పీతవస్త్రాం కరకలితలసత్ హేమ పద్మాం వరాంగీం*
*సర్వాలంకారయుక్తాం సతతం అభయదాం భక్తనమ్రాం భవానీం*
*శ్రీవిద్యాం శాన్తమూర్తిం సకలసురనుతాం సర్వసమ్పత్ ప్రదాత్రీం ।*

*సకుంకుమ విలేపనాం అళికచుంబికస్తూరికాం*
*సమన్దహసితేక్షణాం సశరచాపపాశాంకుశాం*
*అశేషజనమోహినీం అరుణమాల్యభూషోజ్జ్వలాం*
*జపాకుసుమ భాసురాం జపవిధౌ స్మరేత్ అంబికాం ।*

*వందే మాతరం అంబికాం భగవతీం వాణీ రమా సేవితాం*
*కల్యాణీం కమనీయ కల్పలతికాం కైలాసనాథప్రియాం*
*వేదాన్త ప్రతిపాద్యమానవిభవాం విద్వన్మనోరంజనీం*
*శ్రీచక్రాంకిత రత్నపీఠనిలయాం శ్రీ రాజరాజేశ్వరీం ।*

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః

# శ్రీ లలితా సహస్రనామం

శ్రీమాతా – శ్రీమహారాజ్ఞీ – శ్రీమత్సింహాసనేశ్వరీ, చిదగ్నికుండ సంభూతా – దేవకార్యసముద్యతా, ఉద్యద్భానుసహస్రాభా – చతుర్బాహుసమన్వితా, రాగస్వరూపపాశాఢ్యా – క్రోధాకారాం కుశోజ్జ్వలా, మనోరూపేక్షుకోదండా – పంచతన్మాత్ర సాయకా, నిజారుణప్రభాపూరమజ్జత్ బ్రహ్మాండమండలా, చంపకాశోక పున్నాగ సౌగంధిక లసత్కచా, కురువిందమణిశ్రేణీ కనత్కోటీర మండితా, అష్టమీచంద్రవిభ్రాజదళికస్థలశోభితా, ముఖచంద్ర కళంకాభ మృగనాభివిశేషకా, వదనస్మర మాంగల్య గృహతోరణ చిల్లికా, వక్త్రలక్ష్మీపరీవాహ చలన్మీనాభలోచనా, నవచంపకపుష్పాభ నాసాదండవిరాజితా, తారాకాంతితిరస్కారి నాసాభరణభాసురా, కదంబమంజరీక్లుప్త కర్ణపూరమనోహరా, తాటంకయుగళీభూత తపనోడుపమండలా, పద్మరాగశిలాదర్శ పరిభావి కపోలభూః, నవవిద్రుమబింబశ్రీ న్యక్కారి రదనచ్ఛదా, శుద్ధవిద్యాంకురాకార ద్విజపంక్తి ద్వయోజ్జ్వలా, కర్పూరవీటికామోద సమాకర్షి దిగంతరా, నిజసల్లాపమాధుర్య వినిర్భత్సిత కచ్ఛపీ, మందస్మిత ప్రభాపూర మజ్జత్ కామేశమానసా, అనాకలితసాదృశ్య చుబుకశ్రీవిరాజితా, కామేశబద్ధ మాంగల్యసూత్ర శోభితకంధరా, కనకాంగద కేయూర కమనీయభుజాన్వితా, రత్నగ్రైవేయ చింతాకలోలముక్తాఫలాన్వితా, కామేశ్వర ప్రేమరత్నమణి ప్రతిపణ స్తనీ, నాభ్యాలవాల రోమాళి లతా ఫల కుచద్వయీ, లక్ష్య రోమలతాధారతా సమున్నేయమధ్యమా, స్తనభారదళన్మధ్య పట్టబంధవళిత్రయా, అరుణారుణ కౌసుంభ వస్త్రభాస్వత్ కటీతటీ, రత్న కింకిణికా రమ్యరశనా దామభూషితా,





కామేశజ్ఞాత సౌభాగ్య మార్దవోరుద్వయాన్వితా, మాణిక్య మకుటాకార జానుద్వయవిరాజితా, ఇంద్రగోపపరిక్షిప్త స్మర తూణాభ జంఘికా, గూఢగుల్ఫా – కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా, నఖదీధితిసంఛన్న నమజ్జనతమోగుణా, పదద్వయ ప్రభాజాల పరాకృతసరోరుహా, సింజానమణిమంజీర మణ్డిత శ్రీపదాంబుజా, మరాళీ మన్దగమనా – మహాలావణ్య శేవధిః, సర్వారుణా – అనవద్యాంగీ – సర్వాభరణభూషితా, శివ కామేశ్వరాంకస్థా – శివా – స్వాధీనవల్లభా, సుమేరుమధ్య శృంగస్థా – శ్రీమన్నగర నాయికా, చింతామణి గృహాంతస్థా – పంచబ్రహ్మాసనస్థితా, మహాపద్మాటవీ సంస్థా – కదంబవనవాసినీ, సుధాసాగర మధ్యస్థా – కామాక్షీ – కామదాయినీ, దేవర్షిగణసంఘాత స్తూయమానాత్మవైభవా, భండాసురవధోద్యుక్తశక్తిసేనా సమన్వితా, సంపత్కరీసమారూఢ సింధూర వ్రజసేవితా, అశ్వారూఢాధిష్ఠిత అశ్వకోటికోటిభిరావృతా, చక్రరాజరథారూఢ సర్వాయుధపరిష్కృతా, గేయచక్రరథారూఢ మంత్రిణీపరిసేవితా, కిరిచక్రరథారూఢ దండనాథాపురస్కృతా, జ్వాలామాలినికాక్షిప్త వహ్నిప్రాకారమధ్యమా, భండసైన్యవధోద్యుక్త శక్తివిక్రమహర్షితా, నిత్యా పరాక్రమాటోప నిరీక్షణసముత్సుకా, భండపుత్రవధోద్యుక్త బాలా విక్రమనందితా, మంత్రిణ్యంబావిరచిత విషంగవధతోషితా, విశుక్ర ప్రాణహరణ వారాహీ వీర్యనందితా, కామేశ్వర ముఖాలోకకల్పిత శ్రీగణేశ్వరా, మహాగణేశ నిర్భిన్న విఘ్నయంత్ర ప్రహర్షితా, భండాసురేంద్ర నిర్ముక్త శస్త్ర ప్రత్యస్త్రవర్షిణీ, కరాంగుళినఖోత్పన్న నారాయణ దశాకృతిః, మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసురసైనికా, కామేశ్వరాస్త్ర నిర్దగ్ధ సభండాసురశూన్యకా, బ్రహ్మోపేంద్ర మహేంద్రాది దేవసంస్తుత వైభవా, హరనేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవనౌషధిః, శ్రీమత్ వాగ్భవ కూటైక స్వరూప ముఖపంకజా, కంఠాధః కటిపర్యంత మధ్యకూటస్వరూపిణీ, శక్తికూటైకతాపన్న కట్యధోభాగధారిణీ,

మూలమంత్రాత్మికా – మూలకూటత్రయ కళేబరా, కులామృతైక రసికా – కులసంకేతపాలినీ, కులాంగనా – కులాంతస్థా – కౌలినీ – కులయోగినీ, అకులా – సమయాంతస్థా – సమయాచార తత్పరా, మూలాధారైక నిలయా – బ్రహ్మగ్రంధి విభేదినీ, **(100)**
మణిపూరాంతరుదితా – విష్ణుగ్రంధి విభేదినీ,
ఆజ్ఞాచక్రాంతరాలస్థా – రుద్రగ్రంధి విభేదినీ,
సహస్రారాంబుజారూఢా – సుధాసారాభివర్షిణీ, తటిల్లతా సమరుచిః – షట్చక్రోపరిసంస్థితా, మహాసక్తిః – కుండలినీ – బిసతంతు తనీయసీ, భవానీ – భావనాగమ్యా – భవారణ్యకుఠారికా, భద్రప్రియా – భద్రమూర్తిః – భక్త సౌభాగ్యదాయినీ, భక్తిప్రియా – భక్తిగమ్యా – భక్తివశ్యా – భయాపహా, శాంభవీ – శారదారాధ్యా – శర్వాణీ – శర్మదాయినీ, శాంకరీ – శ్రీకరీ – సాధ్వీ – శరచ్చంద్రనిభాననా, శాతోదరీ – శాన్తిమతీ – నిరాధారా – నిరంజనా, నిర్లేపా – నిర్మలా – నిత్యా – నిరాకారా – నిరాకులా, నిర్గుణా – నిష్కలా – శాన్తా – నిష్కామా – నిరుపప్లవా, నిత్యముక్తా – నిర్వికారా – నిష్ప్రపంచా – నిరాశ్రయా, నిత్యశుద్ధా – నిత్యబుద్ధా – నిరవద్యా – నిరంతరా, నిష్కారణా – నిష్కలంకా – నిరుపాధిః – నిరీశ్వరా, నీరాగా – రాగమథనీ – నిర్మదా – మదనాశినీ, నిశ్చిన్తా – నిరహంకారా – నిర్మోహా – మోహనాశినీ, నిర్మమా – మమతాహన్త్రీ – నిష్పాపా – పాపనాశినీ, నిష్క్రోధా – క్రోధశమనీ – నిర్లోభా – లోభనాశినీ, నిస్సంశయా – సంశయఘ్నీ – నిర్భవా – భవనాశినీ, నిర్వికల్పా – నిరాబాధా – నిర్భేదా – భేదనాశినీ, నిర్నాశా – మృత్యుమథనీ – నిష్క్రియా – నిష్పరిగ్రహా, నిస్తులా – నీలచికురా – నిరపాయా – నిరత్యయా, దుర్లభా – దుర్గమా – దుర్గా – దుఃఖహన్త్రీ – సుఖప్రదా, దుష్టదూరా – దురాచారశమనీ – దోషవర్జితా, సర్వజ్ఞా – సాంద్రకరుణా – సమానాధికవర్జితా, సర్వశక్తిమయీ – సర్వమంగళా **(200)** –





సద్గతిప్రదా, సర్వేశ్వరీ – సర్వమయీ – సర్వమన్త్రస్వరూపిణీ, సర్వయన్త్రాత్మికా – సర్వతన్త్రరూపా – మనోన్మనీ, మాహేశ్వరీ – మహాదేవీ – మహాలక్ష్మీః – మృడప్రియా, మహారూపా – మహాపూజ్యా – మహాపాతకనాశినీ, మహామాయా – మహాసత్త్వా – మహాశక్తిః – మహారతిః, మహాభోగా – మహైశ్వర్యా – మహావీర్యా – మహాబలా, మహాబుద్ధిః – మహాసిద్ధిః – మహా యోగేశ్వరేశ్వరీ, మహాతన్త్రా – మహామన్త్రా – మహాయన్త్రా – మహాసనా, మహాయాగక్రమారాధ్యా – మహాభైరవపూజితా, మహేశ్వర మహాకల్ప మహాతాండవ సాక్షిణీ, మహాకామేశమహిషీ – మహాత్రిపురసుందరీ, చతుష్షష్టి ఉపచారాఢ్యా – చతుష్షష్టి కళామయీ, మహాచతుష్షష్టి కోటి యోగినీగణసేవితా, మనువిద్యా – చంద్రవిద్యా – చంద్రమండలమధ్యగా, చారురూపా – చారుహాసా – చారుచంద్రకళాధరా, చరాచరజగన్నాథా – చక్రరాజ నికేతనా, పార్వతీ – పద్మనయనా – పద్మరాగసమప్రభా, పంచప్రేతాసనాసీనా – పంచబ్రహ్మ స్వరూపిణీ, చిన్మయీ – పరమానన్దా – విజ్ఞానఘన రూపిణీ, ధ్యాన ధ్యాతృ ధ్యేయ రూపా – ధర్మాధర్మవివర్జితా, విశ్వరూపా – జాగరిణీ – స్వపన్తీ – తైజసాత్మికా, సుప్తా – ప్రాజ్ఞాత్మికా – తుర్యా – సర్వావస్థావివర్జితా, సృష్టికర్త్రీ – బ్రహ్మరూపా – గోప్త్రీ – గోవిన్దరూపిణీ, సంహారిణీ – రుద్రరూపా – తిరోధానకరీ – ఈశ్వరీ, సదాశివా – అనుగ్రహదా – పంచకృత్యపరాయణా, భానుమండలమధ్యస్థా – భైరవీ – భగమాలినీ, పద్మాసనా – భగవతీ – పద్మనాభసహోదరీ, ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః, సహస్రశీర్ష వదనా – సహస్రాక్షీ – సహస్రపాత్, ఆబ్రహ్మకీటజననీ – వర్ణాశ్రమవిధాయినీ, నిజాజ్ఞారూపనిగమా – పుణ్యాపుణ్యఫలప్రదా, శ్రుతి సీమన్త సిందూరీ కృత పాదాబ్జధూళికా, సకలాగమసందోహ శుక్తి సంపుట మౌక్తికా, పురుషార్థప్రదా – పూర్ణా – భోగినీ – భువనేశ్వరీ,

అంబికా – అనాదినిధనా – హరిబ్రహ్మేంద్ర సేవితా, నారాయణీ – నాదరూపా – నామరూపవివర్జితా, (300) హ్రీంకారీ – హ్రీమతీ – హృద్యా – హేయోపాదేయవర్జితా, రాజరాజార్చితా – రాజ్ఞీ – రమ్యా – రాజీవలోచనా, రంజనీ – రమణీ – రస్యా – రణత్కింకిణి మేఖలా, రమా – రాకేందువదనా – రతిరూపా – రతిప్రియా, రక్షాకరీ – రాక్షసఘ్నీ – రామా – రమణలంపటా, కామ్యా – కామకళారూపా – కదంబకుసుమప్రియా, కల్యాణీ – జగతీకందా – కరుణారససాగరా, కళావతీ – కళాలాపా – కాన్తా – కాదంబరీప్రియా, వరదా – వామనయనా – వారుణీమదవిహ్వలా, విశ్వాధికా – వేదవేద్యా – విన్ధ్యాచలనివాసినీ, విధాత్రీ – వేదజననీ – విష్ణుమాయా – విలాసినీ, క్షేత్రస్వరూపా – క్షేత్రేశీ – క్షేత్రక్షేత్రజ్ఞ పాలినీ, క్షయవృద్ధివినిర్ముక్తా – క్షేత్రపాలసమర్చితా, విజయా – విమలా – వన్ద్యా – వన్దారుజనవత్సలా, వాగ్వాదినీ – వామకేశీ – వహ్నిమణ్డలవాసినీ, భక్తిమత్కల్పలతికా – పశుపాశవిమోచనీ, సంహృతాశేషపాషండా – సదాచారప్రవర్తికా, తాపత్రయాగ్నిసంతప్త సమాహ్లాదన చంద్రికా, తరుణీ – తాపసారాధ్యా – తనుమధ్యా – తమోపహా, చితిః – తత్ పద లక్ష్యార్థా – చిదేకరస రూపిణీ, స్వాత్మానందలవీభూతబ్రహ్మాద్యానంద సంతతిః, పరా – ప్రత్యక్చితీ రూపా – పశ్యంతీ – పరదేవతా, మధ్యమా – వైఖరీ రూపా – భక్తమానసహంసికా, కామేశ్వరప్రాణనాడీ – కృతజ్ఞా – కామపూజితా, శృంగారరససంపూర్ణా – జయా – జాలంధరస్థితా, ఓడ్యాణపీఠనిలయా – బిందుమణ్డలవాసినీ, రహోయాగ క్రమారాధ్యా – రహస్తర్పణతర్పితా, సద్యః ప్రసాదినీ – విశ్వసాక్షిణీ – సాక్షివర్జితా, షడంగదేవతాయుక్తా – షాడ్గుణ్యాపరిపూరితా, నిత్యక్లిన్నా – నిరుపమా – నిర్వాణసుఖదాయినీ, నిత్యాషోడశికారూపా – శ్రీకంఠార్ధశరీరిణీ, ప్రభావతీ – ప్రభారూపా – ప్రసిద్ధా – పరమేశ్వరీ, మూలప్రకృతిః – అవ్యక్తా – వ్యక్తావ్యక్త స్వరూపిణీ,





వ్యాపినీ (400) – వివిధాకారా – విద్యావిద్యా స్వరూపిణీ, మహాకామేశనయన కుముద ఆహ్లాద కౌముదీ, భక్త హార్ద తమో భేద భానుమత్ భానుసంతతిః, శివదూతీ – శివారాధ్యా – శివమూర్తిః – శివంకరీ, శివప్రియా – శివపరా – శిష్టేష్టా – శిష్టపూజితా, అప్రమేయా – స్వప్రకాశా – మనోవాచామగోచరా, 'చిత్' శక్తిః – చేతనారూపా – జడశక్తిః – జడాత్మికా, గాయత్రీ – వ్యాహృతిః – సంధ్యా – ద్విజబృందనిషేవితా, తత్త్వాసనా – తత్ – త్వం – అయీ – పంచకోశాంతరస్థితా, నిస్సీమ మహిమా – నిత్యయౌవనా – మదశాలినీ, మదఘూర్ణితరక్తాక్షీ – మదపాటల గండభూః, చందనద్రవ దిగ్ధాంగీ – చాంపేయకుసుమప్రియా, కుశలా – కోమలాకారా – కురుకుల్లా – కులేశ్వరీ, కులకుండాలయా – కౌలమార్గ తత్పరసేవితా, కుమారగణనాథాంబా – తుష్టిః – పుష్టిః – మతిః – ధృతిః, శాన్తిః – స్వస్తిమతీ – కాన్తిః – నందినీ – విఘ్ననాశినీ, తేజోవతీ – త్రినయనా – లోలాక్షీకామరూపిణీ, మాలినీ – హంసినీ – మాతా – మలయాచలవాసినీ, సుముఖీ – నళినీ – సుభ్రూః – శోభనా – సురనాయికా, కాలకంఠీ – కాన్తిమతీ – క్షోభిణీ – సూక్ష్మరూపిణీ, వజ్రేశ్వరీ – వామదేవీ – వయోవస్థావివర్జితా, సిద్ధేశ్వరీ – సిద్ధవిద్యా – సిద్ధమాతా – యశస్వినీ, విశుద్ధిచక్ర నిలయా – ఆరక్తవర్ణా – త్రిలోచనా, ఖట్వాంగాది ప్రహరణా – వదనైకసమన్వితా, పాయసాన్నప్రియా – త్వక్స్థా – పశులోకభయంకరీ, అమృతాది మహాశక్తిసంవృతా – డాకినీశ్వరీ, అనాహతాబ్జనిలయా – శ్యామాభా – వదనద్వయా, దంష్ట్రోజ్జ్వలా – అక్షమాలాది ధరా – రుధిరసంస్థితా, కాలరాత్ర్యాది శక్త్యౌఘవృతా – స్నిగ్ధౌదనప్రియా, మహావీరేంద్రవరదా – రాకిణ్యంబాస్వరూపిణీ, మణిపూరాబ్జనిలయా – వదనత్రయ సంయుతా, వజ్రాదిక ఆయుధోపేతా – డామర్యాదిభిరావృతా, రక్తవర్ణా – మాంస నిష్ఠా (500) – గుడాన్న ప్రీతమానసా, సమస్తభక్త సుఖదా – లాకిన్యంబా

స్వరూపిణీ, స్వాధిష్టానాంబుజ గతా – చతుర్వక్త్ర మనోహరా, శూలాద్యాయుధసంపన్నా – పీతవర్ణా – అతిగర్వితా, మేదోనిష్ఠా – మధుప్రీతా – బందిన్యాదిసమన్వితా, దధ్యన్నాసక్తహృదయా – కాకినీరూపధారిణీ, మూలాధారాంబుజారూఢా – పంచవక్త్రా – అస్థిసంస్థితా, అంకుశాదిప్రహరణా – వరదాది నిషేవితా, ముద్గౌదనాసక్తచిత్తా – సాకిన్యంబాస్వరూపిణీ, ఆజ్ఞాచక్రాబ్జ నిలయా – శుక్లవర్ణా – షడాననా, మజ్జాసంస్థా – హంసవతీ ముఖ్యశక్తి సమన్వితా, హరిద్రాన్నైకరసికా – హాకినీరూపధారిణీ, సహస్రదళపద్మస్థా – సర్వవర్ణోపశోభితా, సర్వాయుధధరా – శుక్లసంస్థితా – సర్వతోముఖీ, సర్వౌదనప్రీతచిత్తా – యాకిన్యంబా స్వరూపిణీ, స్వాహా – స్వధా – అమతిః – మేధా – శ్రుతిః – స్మృతిః – అనుత్తమా, పుణ్యకీర్తిః – పుణ్యలభ్యా – పుణ్యశ్రవణ కీర్తనా, పులోమజార్చితా – బంధమోచనీ – బర్బరాలకా, విమర్శరూపిణీ – విద్యా – వియదాది జగత్ప్రసూః, సర్వవ్యాధిప్రశమనీ – సర్వమృత్యునివారిణీ, అగ్రగణ్యా – అచింత్యరూపా – కలికల్మషనాశినీ, కాత్యాయనీ – కాలహన్త్రీ – కమలాక్షనిషేవితా, తాంబూల పూరితముఖీ – దాడిమీకుసుమ ప్రభా, మృగాక్షీ – మోహినీ – ముఖ్యా – మృడానీ – మిత్రరూపిణీ, నిత్యతృప్తా – భక్తనిధిః – నియన్త్రీ – నిఖిలేశ్వరీ, మైత్ర్యాది వాసనా లభ్యా – మహాప్రళయసాక్షిణీ, పరాశక్తిః – పరానిష్ఠా – ప్రజ్ఞాన ఘనరూపిణీ, మాధ్వీపానాలసా – మత్తా – మాతృకా వర్ణరూపిణీ, మహాకైలాస నిలయా – మృణాళమృదు దోర్లతా, మహనీయా – దయామూర్తిః – మహాసామ్రాజ్యశాలినీ, ఆత్మవిద్యా – మహావిద్యా – శ్రీవిద్యా – కామసేవితా, శ్రీ షోడశాక్షరీ విద్యా – త్రికూటా – కామకోటికా, కటాక్ష కింకరీ భూత కమలా కోటి సేవితా, శిరస్స్థితా – చంద్రనిభా – భాలస్థా – ఇంద్రధనుఃప్రభా, హృదయస్థా – రవిప్రఖ్యా – త్రికోణాంతర దీపికా, దాక్షాయణీ – దైత్యహన్త్రీ –





దక్షయజ్ఞవినాశినీ, (600) దరాందోళిత దీర్ఘాక్షీ – దరహాసోజ్జ్వలన్ ముఖీ, గురుమూర్తిః – గుణనిధిః – గోమాతా – గుహజన్మభూః, దేవేశీ – దండనీతిస్థా – దహరాకాశరూపిణీ, ప్రతిపన్ ముఖ్య రాకాంత తిథిమండలపూజితా, కళాత్మికా – కళానాథా – కావ్యాలాప వినోదినీ, సచామర రమా వాణీ సవ్య దక్షిణ సేవితా, ఆదిశక్తిః – అమేయా – ఆత్మా – పరమా – పావనాకృతిః, అనేక కోటి బ్రహ్మాండ జననీ – దివ్యవిగ్రహా, క్లీంకారీ – కేవలా – గుహ్యా – కైవల్యపదదాయినీ, త్రిపురా – త్రిజగద్వంద్యా – త్రిమూర్తిః – త్రిదశేశ్వరీ, త్ర్యక్షరీ – దివ్యగంధాఢ్యా – సిందూర తిలకాంచితా, ఉమా – శైలేంద్రతనయా – గౌరీ – గంధర్వసేవితా, విశ్వగర్భా – స్వర్ణగర్భా – అవరదా – వాగధీశ్వరీ, ధ్యానగమ్యా – అపరిచ్ఛేద్యా – జ్ఞానదా – జ్ఞానవిగ్రహా, సర్వవేదాంత సంవేద్యా – సత్యానంద స్వరూపిణీ, లోపాముద్రార్చితా – లీలాక్లృప్త బ్రహ్మాండమండలా, అదృశ్యా – దృశ్యరహితా – విజ్ఞాత్రీ – వేద్యవర్జితా, యోగినీ – యోగదా – యోగ్యా – యోగానందా – యుగంధరా, ఇఛ్చాశక్తిః జ్ఞానశక్తిః క్రియాశక్తిః స్వరూపిణీ, సర్వాధారా – సుప్రతిష్ఠా – సదసద్రూపధారిణీ, అష్టమూర్తిః – అజాజైత్రీ – లోకయాత్రా విధాయినీ, ఏకాకినీ – భూమరూపా – నిర్ద్వైతా – ద్వైతవర్జితా, అన్నదా – వసుదా – వృద్ధా – బ్రహ్మాత్మైక్య స్వరూపిణీ, బృహతీ – బ్రాహ్మణీ – బ్రాహ్మీ – బ్రహ్మానందా – బలిప్రియా, భాషారూపా – బృహత్సేనా – భావాభావవివర్జితా, సుఖారాధ్యా – శుభకరీ – శోభనాసులభా గతిః, రాజరాజేశ్వరీ – రాజ్యదాయినీ – రాజ్యవల్లభా, రాజత్కృపా – రాజపీఠనివేశిత నిజాశ్రితా, రాజ్యలక్ష్మీః – కోశనాథా – చతురంగబలేశ్వరీ, సామ్రాజ్యదాయినీ – సత్యసంధా – సాగరమేఖలా, దీక్షితా – దైత్యశమనీ – సర్వలోకవశంకరీ, సర్వార్థ దాత్రీ – సావిత్రీ – సచ్చిదానందరూపిణీ, (700) దేశకాల అపరిచ్ఛిన్నా – సర్వగా – సర్వమోహినీ, సరస్వతీ – శాస్త్రమయీ –

గుహాంబా – గుహ్యరూపిణీ, సర్వోపాధివినిర్ముక్తా – సదాశివ పతివ్రతా, సంప్రదాయేశ్వరీ – సాధు – ఈ – గురుమండల రూపిణీ, కులోత్తీర్ణా – భగారాధ్యా – మాయా – మధుమతీ – మహీ, గణాంబా – గుహ్యకారాధ్యా – కోమలాంగీ – గురుప్రియా, స్వతంత్రా – సర్వతంత్రేశీ – దక్షిణామూర్తిరూపిణీ, సనకాది సమారాధ్యా – శివజ్ఞాన ప్రదాయినీ, చిత్కలా – ఆనందకలికా – ప్రేమరూపా – ప్రియంకరీ, నామపారాయణప్రీతా – నందివిద్యా – నటేశ్వరీ, మిథ్యాజగత్ అధిష్ఠానా – ముక్తిదా – ముక్తిరూపిణీ, లాస్యప్రియా – లయకరీ – లజ్జా – రంభాదివందితా, భవ దావ సుధావృష్టిః – పాపారణ్యదవానలా, దౌర్భాగ్య తూల వాతూలా – జరాధ్వాంతర విప్రభా, భాగ్యాబ్ధిచంద్రికా – భక్త చిత్త కేకి ఘనాఘనా, రోగపర్వతదంభోళిః – మృత్యుదారుకుఠారికా, మహేశ్వరీ – మహాకాళీ – మహాగ్రాసా – మహాశనా, అపర్ణా – చండికా – చండముండాసురనిషూదినీ, క్షరాక్షరాత్మికా – సర్వలోకేశీ – విశ్వధారిణీ, త్రివర్గదాత్రీ – సుభగా – త్ర్యంబకా – త్రిగుణాత్మికా, స్వర్గాపవర్గదా – శుద్ధా – జపాపుష్పనిభాకృతిః, ఓజోవతీ – ద్యుతిధరా – యజ్ఞరూపా – ప్రియవ్రతా, దురారాధ్యా – దురాధర్షా – పాటలీకుసుమప్రియా, మహతీ – మేరునిలయా – మందారకుసుమప్రియా, వీరారాధ్యా – విరాడ్రూపా – విరజా – విశ్వతోముఖీ, ప్రత్యగ్రూపా –పరాకాశా – ప్రాణదా – ప్రాణరూపిణీ, మార్తాండ భైరవారాధ్యా – మంత్రిణీ న్యస్త రాజ్యధూః, త్రిపురేశీ – జయత్సేనా – నిస్త్రైగుణ్యా – పరాపరా, సత్యజ్ఞానానందరూపా – సామరస్య పరాయణా, కపర్దినీ – కళామాలా – కామధుక్ – కామరూపిణీ, కళానిధిః – కావ్యకళా – రసజ్ఞా – రసశేవధిః, **(800)** పుష్టా – పురాతనా – పూజ్యా – పుష్కరా – పుష్కరేక్షణా, పరంజ్యోతిః – పరంధామ – పరమాణుః – పరాత్పరా, పాశహస్తా – పాశహన్త్రీ – పరమన్త్రవిభేదినీ, మూర్తా – అమూర్తా –





అనిత్యతృప్తా – మునిమానసహంసికా, సత్యవ్రతా – సత్యరూపా – సర్వాంతర్యామిణీ – సతీ, బ్రహ్మాణీ – బ్రహ్మ – జననీ – బహురూపా – బుధార్చితా, ప్రసవిత్రీ – ప్రచండా – ఆజ్ఞా – ప్రతిష్ఠా – ప్రకటాకృతిః, ప్రాణేశ్వరీ – ప్రాణదాత్రీ – పంచాశత్పీఠ రూపిణీ, విశృంఖలా – వివిక్తస్థా – వీరమాతా – వియత్ప్రసూః, ముకుందా – ముక్తినిలయా – మూలవిగ్రహరూపిణీ, భావజ్ఞా – భవరోగఘ్నీ – భవచక్ర ప్రవర్తినీ, ఛందస్సారా – శాస్త్రసారా – మన్త్రసారా – తలోదరీ, ఉదారకీర్తిః – ఉద్దామవైభవా – వర్ణరూపిణీ, జన్మ మృత్యు జరా తప్తజన విశ్రాన్తిదాయినీ, సర్వోపనిషదుద్ఘుష్టా – శాన్త్యతీతకళాత్మికా, గంభీరా – గగనాంతస్థా – గర్వితా – గానలోలుపా, కల్పనారహితా – కాష్ఠా – అకాంతా – కాన్తార్ధ విగ్రహా, కార్య కారణ నిర్ముక్తా – కామకేళి తరంగితా, కనత్ కనక తాటంకా – లీలావిగ్రహధారిణీ, అజా – క్షయవినిర్ముక్తా – ముగ్ధా – క్షిప్రప్రసాదినీ, అన్తర్ముఖ సమారాధ్యా – బహిర్ముఖ సుదుర్లభా, త్రయీ – త్రివర్గ నిలయా – త్రిస్థా – త్రిపురమాలినీ, నిరామయా – నిరాలంబా – స్వాత్మారామా – సుధాసృతిః, సంసారపంకనిర్మగ్న సముద్ధరణ పండితా, యజ్ఞప్రియా – యజ్ఞకర్త్రీ – యజమానస్వరూపిణీ, ధర్మాధారా – ధనాధ్యక్షా – ధనధాన్య వివర్ధినీ, విప్రప్రియా – విప్రరూపా – విశ్వభ్రమణ కారిణీ, విశ్వగ్రాసా – విద్రుమాభా – వైష్ణవీ – విష్ణురూపిణీ, అయోనిః – యోనినిలయా – కూటస్థా – కులరూపిణీ, వీరగోష్ఠీప్రియా – వీరా – నైష్కర్మ్య **(900)** – నాదరూపిణీ, విజ్ఞానకలనా – కల్యా – విదగ్ధా – బైందవాసనా, తత్త్వాధికా – తత్త్వమయీ – తత్త్వమర్థ స్వరూపిణీ, సామగానప్రియా – సౌమ్యా – సదాశివ కుటుంబినీ, సవ్యాపసవ్య మార్గస్థా – సర్వాపద్ వినివారిణీ, స్వస్థా – స్వభావ మధురా – ధీరా – ధీరసమర్చితా, చైతన్యార్ఘ్య సమారాధ్యా – చైతన్యకుసుమప్రియా, సదోదితా – సదా తుష్టా –

తరుణాదిత్య పాటలా, దక్షిణాదక్షిణ ఆరాధ్యా – దరస్మేర ముఖాంబుజా, కౌలినీకేవలా – అనర్ఘ్యకైవల్యపదదాయినీ, స్తోత్ర ప్రియా – స్తుతిమతీ – శ్రుతిసంస్తుత వైభవా, మనస్వినీ – మానవతీ – మహేశీ – మంగళాకృతిః, విశ్వమాతా – జగత్ ధాత్రీ – విశాలాక్షీ – విరాగిణీ, ప్రగల్భా – పరమోదారా – పరామోదా – మనోన్మయీ, వ్యోమకేశీ – విమానస్థా – వజ్రిణీ – వామకేశ్వరీ, పంచయజ్ఞప్రియా – పంచప్రేత మంచాధిశాయినీ, పంచమీ – పంచభూతేశీ – పంచసంఖ్యోపచారిణీ, శాశ్వతీ – శాశ్వతైశ్వర్యా – శర్మదా – శంభుమోహినీ, ధరా – ధరసుతా – ధన్యా – ధర్మిణీ – ధర్మవర్ధినీ, లోకాతీతా – గుణాతీతా – సర్వాతీతా – శమాత్మికా, బంధూకకుసుమప్రఖ్యా – బాలా – లీలావినోదినీ, సుమంగలీ – సుఖకరీ – సువేషాఢ్యా – సువాసినీ, సువాసిన్యర్చనప్రీతా – ఆశోభనా – శుద్ధమానసా, బిందు తర్పణ సంతుష్టా – పూర్వజా – త్రిపురాంబికా, దశముద్ర సమారాధ్యా – త్రిపురాశ్రీ వశంకరీ, జ్ఞానముద్రా – జ్ఞానగమ్యా – జ్ఞాన జ్ఞేయ స్వరూపిణీ, యోనిముద్రా – త్రిఖండేశీ – త్రిగుణా – అంబా – త్రికోణగా, అనఘా – అద్భుతచారిత్రా – వాంఛితార్థ ప్రదాయినీ, అభ్యాసాతిశయజ్ఞాతా – షడధ్వాతీతరూపిణీ, అవ్యాజ కరుణా మూర్తిః – అజ్ఞానధ్వాంత దీపికా, ఆబాలగోప విదితా – సర్వానుల్లంఘ్య శాసనా, శ్రీచక్రరాజ నిలయా – శ్రీమత్ త్రిపుర సుందరీ, శ్రీ శివా – శివశక్త్యైక్యరూపిణీ – లలితాంబికా ।

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః ।

యదక్షరం పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్, పూర్ణం భవతు
తత్సర్వం త్వత్ప్రసాదాన్మహేశ్వరి । ప్రసీద భగవత్యంబ ప్రసీద
భక్తవత్సలే, ప్రసాదం కురు మే దేవి లలితే దేవి నమోస్తు తే ।

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః

అధ్యాయము 01

# 1. శ్రీ పంచకోశాంతరస్థితా, శ్రీ లలితాంబికా

అన్నం తినేదెందుకు? ప్రాణాలు నిలబెట్టుకోవటం కోసం. దానివల్ల ఏమి ఉపయోగం? ప్రాణాలు స్థిరంగా ఉంటే మనసుకి శాంతి లభిస్తుంది. మనశ్శాన్తి వల్ల ఏమి ఉపయోగం? అప్పుడు పుస్తకాలు చదివో, ఆడియోలు వినో, వీడియోలు చూసో కొంత జ్ఞానం సంపాదించుకోవచ్చును. జ్ఞానం ఎందుకు? విషయాలు క్షుణ్ణంగా తెలిసినప్పుడు కలిగే ఆనందం చాలా గొప్పగా ఉంటుంది. ఇలా అన్న-ప్రాణ-మనో-విజ్ఞాన-ఆనందాలు ఐదూ ఒకదానిమీద ఒకటి ఆధారపడి ఉన్నాయి. ఈ ఐదింటినీ ఐదు కోశాలుగా భారతీయ శాస్త్రజ్ఞులు గ్రహించారు. ఈ ఫండమెంటల్ విభజనని అర్థం చేసుకుంటే ఆత్మ సాక్షాత్కారం కలిగి ఆత్మానందానికి దారితీయగలదని తెలియజేశారు. అదెలాగో చూసి, ఈ విషయంలో అమ్మవారి నామాల ప్రత్యేకత గమనిద్దాం.

5 కోశాలు: మరోదానిని తనలో ఇముడ్చుకుని కప్పియుంచేది కోశం (కరెన్సీ నోట్లని దాచుంచే మనీపర్స్ లాగ). అన్నమయకోశం లోపల ప్రాణమయ కోశం, దానిలోపల మనోమయకోశం, దానిలోపల విజ్ఞానమయ కోశం, దానిలోపల ఆనందమయ కోశం కప్పబడి ఉంటాయిట. ఒక ఇల్లు, ఆ ఇంటిలో ఒక గది, ఆ గదిలోపల ఒక బీరువా, బీరువాలోపల లాకర్, లాకర్‌లోపల సీక్రెట్ లాకర్‌లాగ ఈ ఐదు కోశాలూ ఒకదానిలోపల మరొకటి ఇమిడి ఉంటాయి. సీక్రెట్ లాకర్ అయిన ఆనందమయకోశం తెలుసుకుని తెరిచి చూసుకోగలమా, అన్నది మన సమస్య. అన్నమయకోశం స్థూల శరీరం. ప్రాణమయ-మనోమయ-విజ్ఞానమయ కోశాలు మూడూ కలిసి సూక్ష్మ శరీరం. ఆనందమయ కోశం కారణ శరీరం. స్థూల-సూక్ష్మ-కారణ శరీరత్రయం, లేక ఐదు కోశాలను కలిపిన వ్యవస్థకి "గుహ" అని పేరు. ఈ గుహ అంతా అమ్మవారు వ్యాపించి ఉంటుందని





తెలియజేస్తూ "**గుహ్యా, గుహాంబా, గుహ్యరూపిణీ**" అని ఆమె నామాలు.

పుట్టుక-గిట్టుట ఉన్న అన్నమయకోశం (స్థూల శరీరం) ఆత్మ కాదు.

ప్రాణమయకోశం అంటే వ్యాన వాయువు. ఇది దేహమంతటా వ్యాపించి, బలమిచ్చి, కన్ను వగైరా ఐదు కర్మేంద్రియాలు పనిచేసేలా చేస్తుంది. ఇది కూడా ఆత్మ కాదు.

జ్ఞానేంద్రియాలతో కలసి, అహంకార మమకారాలతో, కామ-క్రోధ-లోభ-మోహాదులతో, సత్త్వ-రజస్-తమో గుణాలతో, నిండిన మనసుకి నిలయం మనోమయకోశం. సంకల్ప - వికల్పాత్మకమైన చంచలత్వం దీని నైజం. అందుకని ఇది ఆత్మ కాదు.

బుద్ధికి నిలయం విజ్ఞానమయకోశం. బుద్ధికి దేహ-ఇంద్రియాలంటే ప్రేమ ఎక్కువ. మనం మెలుకువుగా ఉన్నప్పుడు మాత్రమే పనిచేస్తుంది. ప్రగాఢ నిద్రలో ఉన్నప్పుడు (సుషుప్తి అంటారు) దీని ఉనికి మనకి తెలవదు. ఏ పని చేయాలన్నా నిశ్చయ జ్ఞానం ఉండాలి. ఆ డెసిషన్ పవర్ బుద్ధికి ఉంటుంది; కానీ తప్పు నిర్ణయమనో, కరెక్ట్ నిర్ణయమనో దోషాదోషాలు అంటుకోగలవు. అందుకని ఇదీ ఆత్మ కాదు.

ఈ కోశాలన్నింటికి లోపల ఉండేది ఆనందమయ కోశం. ఇది కూడా ఆత్మ కాదు. కానీ ఇది పరమాత్మను చూడటానికి మనం లోపల పెట్టుకున్న అద్దంలా పనిచేస్తుంది. అసలు వస్తువు ప్రత్యక్షంగా కనిపించక, దాని బింబం మాత్రం అద్దంలో చూడగలమనుకోండి. అప్పుడు ఆత్మ అనుభవించే ఆనంద-అనానందాలను (సుఖదుఃఖాదులు) బుద్ధిజాగ్రత్తతో మనం తెలుసుకోవచ్చును. "కాచిదంతర్ముఖావృత్తిః ఆనంద ప్రతిబింబభాక్, పుణ్యభోగే భోగశాంతౌ నిద్రారూపేణ లీయతే" - పంచదశీ (3-9). మనలోని ఆత్మకు కలిగిన సుఖ దుఃఖానుభూతిలను ఈ విధంగా అంతర్ముఖంగానే తెలుసు కోగలము. "**అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభా**" అని అమ్మవారి నామాలు. అంతర్ముఖంగా ఆత్మసంపర్కం

కలగటం "ప్రతీచి". ఆత్మజ్ఞానం కలగటం "ప్రత్యక్చితి". "**ప్రత్యక్చితీ రూపా**" అని అమ్మవారి నామం.

ఐదు కోశాలూ ఆత్మ కానిపే అంటే ఈ ఐదు కలిసి ఆత్మని కప్పేసి ఉంటాయి. ఆనందమయ కోశంలో మాత్రం, ఆత్మస్థితి ప్రతిబింబం తెలియబడుతూ ఉంటుంది. ఆనందమయకోశాన్ని ఒక అద్దం మాదిరిగా ఊహించుకోవటం కొంచెం కష్టం! అయితే ఒక ఉదాహరణతో అవగాహన చేయవచ్చనిపిస్తూంది. పరీక్షలు వ్రాశాం. మన ఆన్సర్షీట్లు చూసి మార్కులు వేసే ఎగ్జామినర్స్ మనకి తెలవదు. మనం చూడను కూడా చూడని ఆ ఎగ్జామినర్స్ ఇచ్చిన మార్కులుబట్టి పాస్ అయ్యామా (అయితే ఏ క్లాస్?), ఫెయిల్ అయ్యామా, అన్నది పేపర్లో ఫలితాలను చూసో, మార్క్స్షీట్ చూసో మాత్రమే తెలుసుకో గలుగుతున్నాం. అంటే పేపర్ / మార్క్స్షీట్ మన పెర్ఫార్మెన్స్ని, ఎగ్జామినర్ల జడ్జిమెంట్ని, అద్దంలో చూపిస్తున్నట్లు తెలుపుతున్నాయి. అదేవిధంగా మనం సంపాదించుకున్న విజ్ఞానం సుఖానందం పొందటానికి ఉపయోగించామా, దుఃఖదురాగతాలు చేయటానికి ఉపయోగించామా, వాటివల్ల మనకి కనిపించని ఆ ఆత్మ-పరమాత్మ పొందిన అనుభూతి ఎటువంటిది అన్నది ఆనందమయకోశంలో ప్రతిబింబంగా తెలుస్తుంది.

సకల భూతాలు, సర్వ జీవులు పుట్టి బ్రతికేది ఈ ఐదు కోశాల వలనే అని, అందువలన వాటిని బ్రహ్మస్వరూపాలుగా గ్రహించాలని తైత్తిరీయ-భృగువల్లి (2) వివరిస్తుంది:

"అన్నం బ్రహ్మేతి వ్యజానాత్, అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, అన్నేన జాతాని జీవన్తి", "ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్, ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ప్రాణేన జాతాని జీవన్తి", "మనో బ్రహ్మేతి వ్యజానాత్, మనసోహ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, మనసా జాతాని జీవన్తి", "విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్, విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, విజ్ఞానేన జాతాని జీవన్తి", "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్,





ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, ఆనందేన జాతాని జీవన్తి". అమ్మవారు "**పంచకోశాంతరస్థితా**" – అనగా, ఐదు కోశాలలోను ఉంటుంది. అమ్మవారి నామాలను ఈ ఐదు కోశాల పరంగా గమనిద్దాం:

అన్నమయ కోశం: **కాదంబరీ ప్రియా, పాయసాన్న ప్రియా, స్నిగ్ధౌదన ప్రియా, మాంసనిష్ఠా, గుడాన్నప్రీతి మానసా, మధుప్రీతా, దధ్యన్నాసక్త హృదయా, ముద్గౌదనాసక్త చిత్తా, హరిద్రాన్నైక రసికా, సర్వౌదనప్రీత చిత్తా, స్వాహా, స్వధా, తాంబూలపూరితముఖీ, మాధ్వీపానాలసా, అన్నదా, మధుమతీ, మహాగ్రాసా, మహాశనా.**

ప్రాణమయ కోశం: **ప్రాణదా, ప్రాణరూపిణీ, ప్రాణేశ్వరీ, ప్రాణదాత్రీ.**

మనోమయ కోశం: **నిరాకులా, శాన్తా, నిష్కామా, నీరాగా, రాగమథనీ, నిర్మదా, మదనాశినీ, నిశ్చింతా, నిరహంకారా, నిర్మోహా, మోహనాశినీ, నిర్మమా, మమతాహన్త్రీ, నిష్క్రోధా, క్రోధశమనీ, నిర్లోభా, లోభనాశినీ, నిర్గుణా, నిర్వికల్పా, మనోన్మనీ, స్వపన్తీ, హృద్యా, భక్తమానస హంసికా, మదశాలినీ, తుష్టిః, హృదయస్థా, ఇచ్ఛాశక్తి (జ్ఞానశక్తి క్రియాశక్తి) స్వరూపిణీ, మునిమానస హంసికా, మనస్వినీ, మానవతీ, మనోన్మయీ, శుద్ధమానసా.**

విజ్ఞానమయ కోశం: **శాన్తిమతీ, నిరంజనా, నిర్లేపా, నిత్యబుద్ధా, మహాబుద్ధిః, నిష్పాపా, పాపనాశినీ, దోషవర్జితా, నిస్సంశయా, సంశయఘ్నీ, సర్వజ్ఞా, మహాపాతకనాశినీ, విజ్ఞానఘనరూపిణీ, ధర్మా~ధర్మవివర్జితా, జాగరిణీ, వర్ణాశ్రమవిధాయినీ, హ్రీమతీ, హేయోపాదేయవర్జితా, కామ్యా, వేదవేద్యా, విమలా, సదాచార ప్రవర్తికా, తమోపహా, చితిః, ప్రత్యక్చితీరూపా, కృతజ్ఞా, విద్యా~విద్యా స్వరూపిణీ, భక్తహార్ద తమోభేద భానుమద్భాను సంతతిః, మతిః, విద్యా, పరానిష్ఠా, ప్రజ్ఞానఘనరూపిణీ, ఆత్మవిద్యా, మహావిద్యా, శ్రీవిద్యా, శ్రీషోడశాక్షరీ విద్యా, దండనీతిస్థా, జ్ఞానదా, జ్ఞానవిగ్రహా, సర్వ వేదాంత సంవేద్యా, విజ్ఞాత్రీ, (ఇచ్ఛాశక్తి) జ్ఞానశక్తి క్రియాశక్తి స్వరూపిణీ, శాస్త్రమయీ,**

nssnarayana: SrImAta nissIma mahima (2014)

**సర్వతంత్రేశీ, దక్షిణామూర్తిరూపిణీ, శివజ్ఞాన ప్రదాయినీ, ఆజ్ఞా, శాస్త్రసారా, మన్త్రసారా, సర్వోపనిషదుద్ఘుష్టా, త్రయీ, విప్రరూపా, విజ్ఞానకలనా, తత్త్వమయీ, తత్త్వమర్థ స్వరూపిణీ, సవ్యా~పసవ్య మార్గస్థా, ధర్మవర్ధినీ, జ్ఞానముద్రా, జ్ఞానగమ్యా, జ్ఞానజ్ఞేయ స్వరూపిణీ, అజ్ఞానధ్వాంతదీపికా.**

ఆనందమయ కోశం: **దుఃఖహన్త్రీ, సుఖప్రదా, మహాభోగా, చిన్మయీ, పరమానందా, పురుషార్థప్రదా, భోగినీ, రంజనీ, తాపత్రయాగ్ని సంతప్త సమాహ్లాదనచన్ద్రికా, చిదేకరసరూపిణీ, స్వాత్మానంద లవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః, నిర్వాణసుఖదాయినీ, మదఘూర్ణిత రక్తాక్షీ, సూక్ష్మరూపిణీ, దహరాకాశరూపిణీ, సత్యానంద స్వరూపిణీ, భూమరూపా, బ్రహ్మానందా, సచ్చిదానంద రూపిణీ, చిత్కలా, ఆనందకలికా, సత్యజ్ఞానానందరూపా, పరమోదారా, పరామోదా, శర్మదా, శమాత్మికా, సుఖకరీ.**

"**కోశనాథా**" – ఐదు కోశాలకు అధిరాజ్ఞి అయి, ఇన్ని రూపాలుగా అమ్మవారు మన శరీరంలో ఉండి ఆమె ఏం చేస్తూంది? రెండు విషయాలు దృష్టిలో ఉంచుకుంటే కొంత వరకు ఈ ప్రశ్నకి సమాధానం దొరుకవచ్చు.

(1) ఇదివరలో "**సరస్వతీ, శాస్త్రమయీ**" అనే అధ్యాయంలో వాసనలను గురించి కొంత తెలుసుకున్నాం. తత్త్వజ్ఞానాన్ని కలిగించే 50 శుద్ధ వాసనలు, రాగద్వేషాలతో నిండిపోయి తత్త్వ జ్ఞానాన్ని కలిగించలేని 8 దోషపూరిత మలిన వాసనలు ఉన్నాయి. ఈ వాసనలన్నీ అంతఃకరణ చతుష్టయం అనబడే మనస్–బుద్ధి–అహంకార–చిత్తాలని పురికొల్పుతూ ఉంటాయి.

(2) పైన వివరించిన ప్రకారం మనోమయకోశం మనస్సుకి, విజ్ఞానమయ కోశం బుద్ధికి సంబంధించినవి. అంటే వాసనల ప్రభావం ఈ రెండు కోశాలమీద ఉన్నట్లే గదా! మనస్సు సంకల్ప–వికల్పాత్మకం, అంటే ఉద్దేశ్యం మాత్రమే కల్పించుకునేది. ఆ ఉద్దేశ్యాలని కార్యరూపంలోకి తేవాలా వద్దా





అని నిర్ణయించేది, నిశ్చయాత్మక (డెసిషన్ పవర్ ఉన్న) బుద్ధి. ఆ నిర్ణయాలు చేయటంలో బుద్ధి తనకున్న విజ్ఞానాన్ని ఉపయోగించుకుంటుంది. "విజ్ఞానం యజ్ఞం తనుతే, కర్మాణి తనుతే~పి చ" అని తైత్తిరీయ ఆనందవల్లి (5) – యజ్ఞాలని, లౌకిక కర్మలని నడిపించేది విజ్ఞానమే. ఈ ఉద్దేశ్యం తప్పు, ఇది చెడు పని కాబట్టి చేయకూడదు, అని నిర్ణయం చేసి, మనస్సుచేత మలిన వాసనలను బుద్ధి వదిలింప చేయగలదు. ఈ ఉద్దేశ్యం మంచిది, ఈ మంచి పనిని తప్పకుండ చేయాలి, అని నిర్ణయిస్తే, మనస్సుని శుద్ధ వాసనలపైపు మరల్చగలదు. శుద్ధ వాసనలు దైవ–జ్ఞాన వాసనలు కాబట్టి, జీవిని ఆనందమయకోశం పైపు తీసుకెళ్తాయి. కానీ ఈ కార్యక్రమం జరగాలంటే ముందర బుద్ధికి సరి అయిన జ్ఞానం లభించాలి. సరైన జ్ఞానం లేకపోతే జీవిచేత తప్పుపనులు చేయించి బ్రతుకుని మరింత అధ్వాన్నం చేయగలదు; అనగా, జీవి మలిన వాసనలతో అన్నమయ–ప్రాణమయ కోశాలకి మాత్రమే పరిమితమయిపోయి ఆనందమయ కోశాన్ని తెరిచి చూసుకోలేడు.

ఆ సరి అయిన జ్ఞానాన్ని ప్రసాదించే తల్లి అమ్మవారు అని పైనచెప్పిన విజ్ఞానమయకోశంలోని నామాలు తెలియ జేస్తున్నాయి. రాగద్వేషాలు, అరి–షడ్వర్గాలు అనే మానసిక దోషాలను నశింపచేయగలిగిన తల్లి అని మనోమయకోశంలోని నామాలు తెలియజేస్తున్నాయి. అనుకున్నది అనుకున్నట్లుగానే జరిగితే ఎటువంటి సుఖశాన్తులు, ఆనందం కలుగుతుందో తెలియజేసేవి ఆనందమయకోశంలోని నామాలు. పుష్టిగా ఆహారాన్ని ఇచ్చి ప్రాణాలను నిలబెట్టేది ఆ తల్లేనని అన్నమయ – ప్రాణమయ కోశాలలోని నామాలు తెలియజేస్తున్నాయి.

ఓం నమో భగవత్యన్నపూర్ణే మమాభిలషితం అన్నం దేహి – అమ్మా, నాకిష్టమైన ఆహారం పెట్టు – అని అన్నపూర్ణోపనిషత్. ఏమిటి ఆ ఇష్టమైన ఆహారం? ఆది శంకరులు అన్నపూర్ణమ్మ తల్లిని "జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి" అని ప్రార్థించారు. పైకి గమ్మత్తుగా

కనిపిస్తుంది ఈ ప్రార్థన. ఉల్లి, వెల్లుల్లి, మసాలా వగైరాలు లేకుండా చూడమని, నువ్వు పెట్టే తిండి జ్ఞాన–వైరాగ్యాలను సిద్ధింప చేసేలా చూడమని, అమ్మవారు వేసే భిక్షకి శంకరులు మెనూ సెట్ చేస్తున్నారా అనిపిస్తుంది. ఇది చాలా ముఖ్యమైన విషయం. సనత్కుమారులు నారదుడికి ఇచ్చిన సలహాలలో అన్నం బ్రహ్మగా ("అన్నం బ్రహ్మేతి") గ్రహించి అన్నోపాసన చేయమన్నది ఒకటి ("భూమరూపా" అనే అధ్యాయం చూడండి). "అన్నస్యాయై ద్రష్టా భవతి, శ్రోతా భవతి, మన్తా భవతి, బోద్ధా భవతి, కర్తా భవతి, విజ్ఞాతా భవతి" – ఛాందోగ్య ఉపనిషత్ (7–9). చూడాలన్నా, వినాలన్నా, మననం చేయాలన్నా, చెప్పాలన్నా, చేయాలన్నా, తెలుసుకోవాలన్నా, జీవికి అన్నింటికి ముందర ఆహారపుష్టి ఉండాలి. తీసుకున్న ఆహారం శుద్ధమై ఉంటేగానీ ఈ పనులన్నీ సక్రమంగా ఉండవు అనికూడా ఈ ఉపనిషత్ చెప్తూంది. "ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః, సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః, స్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రః, తస్మై మృదితకషాయాయ తమసః పారం దర్శయతి" – ఛాందోగ్య ఉపనిషత్ (7–26). ఆహారశుద్ధి సత్త్వశుద్ధికి, సత్త్వశుద్ధి ధ్రువమైన స్మృతిశుద్ధికి దారితీసి, చివరికి అసలు జ్ఞానం లభిస్తుంది; అలాంటి మృదితకషాయుడు అజ్ఞానాంధకారం దాటగలడు. ["మందు"కి, కషాయానికి అలవాటు పడినవారు రాగద్వేషాలకి లొంగిపోయుంటారు. మిరియాల కషాయం ఘాటుగా ఉంటే మిరియాలని తిట్టకుండా ఆ కషాయం చేసినవాళ్ళని తిట్టుకుంటాం! రాగద్వేషాలు కలగచేసే కషాయాలను వదిలేసినవారు మృదితకషాయులు]. ఈ ఉపనిషద్వాక్యానికి శంకరుల వివరణ: "ఆహ్రియత ఇతి ఆహారః, శబ్దాది విషయవిజ్ఞానం భోక్తుర్భోగా యాహ్రియతే తస్య విషయోపలబ్ధిలక్షణస్య విజ్ఞానస్య శుద్ధిః ఆహారశుద్ధీ రాగద్వేషమోహదోషైః అసంస్పృష్టం విషయవిజ్ఞానం". తినేతిండితో సహితం, ఇంద్రియతృప్తికోసం గ్రహించే విషయవిజ్ఞానం (కంట, ఒంట, నోట, వింట, వాసనా, విందులు) కూడా ఆహారమే. గ్రహించే ఆహారమంతా రాగద్వేషమోహాలతో సంపర్కం లేక దోషరహితమై ఉండాలి. అప్పుడే అసలు–సిసలు జ్ఞానం, తద్ద్వారా వైరాగ్యం సిద్ధించి పరమాత్మ దర్శనం చేసుకోగలం. "జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి" అనే





ప్రార్థనలోని అంతరార్థం ఇది, అని మనకి తెలియజేయటంకోసం శంకరులు అలా చెప్పారుగానీ అన్నమయకోశాధిదేవత అమ్మ వేసే భిక్షలో దోషాలుండవుగాక ఉండవని, మనం ప్రత్యేకించి మెనూ సెట్ చేయక్కర్లేదని వారికి తెలుసును.

"ఓషధి వనస్పతిభిరన్నం భవతి, అన్నేన ప్రాణాః, ప్రాణైర్బలం, బలేన తపః, తపసా శ్రద్ధా, శ్రద్ధయా మేధా, మేధయా మనీషా, మనీషయా మనః, మనసా శాన్తిః, శాన్త్యా చిత్తం, చిత్తేన స్మృతిగ్ం, స్మృత్యా స్మారగ్ం, స్మారేణ విజ్ఞానం, విజ్ఞానేన ఆత్మానం వేదయతి. తస్మాదన్నం దదన్ సర్వాణ్యేతాని దదాతి." – తైత్తిరీయ ఉపనిషత్ – నారాయణ ప్రశ్న (79). ఓషధి వనస్పతులచే అన్నం, అన్నంచే ప్రాణాలు, ప్రాణాలతో బలం, బలంతో తపస్సు, తపస్సుచే శ్రద్ధ, శ్రద్ధతో మేధ, మేధచే బుద్ధి, బుద్ధితో మనస్సు, మనస్సుతో శాన్తి, శాన్తితో చిత్తశుద్ధి, చిత్తంతో స్మృతి (గుర్తుంచుకోవటం), స్మృతితో విజ్ఞానం, విజ్ఞానంతో ఆత్మజ్ఞానం పొందబడతాయి. అందుకని అన్నదానం చేసినవారు, ఇవన్నీ దానం చేసినవారవుతున్నారు.

"అన్నాత్ ప్రాణా భవన్తి భూతానాం, ప్రాణైర్మనో మనసశ్చ విజ్ఞానం, విజ్ఞానాత్ ఆనన్దో బ్రహ్మ యోనిః" – తైత్తిరీయ ఉపనిషత్ – నారాయణ ప్రశ్న (79). సర్వభూతాలు అన్నంవలన ప్రాణాలు నిలబెట్టుకుంటున్నాయి; ప్రాణాలు మనస్సుకి, మనస్సు విజ్ఞానానికి, విజ్ఞానం బ్రహ్మానన్దానికి కారణాలు. "అన్నమయ పాణమయ మనోమయ విజ్ఞానమయం ఆనన్దమయం ఆత్మా మే శుద్ధ్యన్తాం" – తైత్తిరీయ ఉపనిషత్ – నారాయణ ప్రశ్న (66). నాలోని అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనన్దమయ ఆత్మ పరిశుద్ధి చెందుగాక అని ప్రార్థన.

ప్రతి జీవి తాలూకు పంచకోశాలలోను అమ్మవారు ఉండి ఆత్మ పరిశుద్ధికి దారి చూపిస్తూందని "**పంచకోశాంతరస్థితా**" అనే నామం తెలియజేస్తూంది.

ఓం శ్రీ పంచకోశాంతరస్థితాయై నమః,
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ లలితాంబికాయై నమః.

అధ్యాయము 02

# 2. శ్రీ స్వాత్మానంద లవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః, శ్రీ లలితాంబికా

ఓ సినిమాకి వెళ్ళామనుకోండి. అందులో ఒక హీరో, ఆ హీరోకి ఒక హీరోయిన్ (అవసరమైతే ఇద్దరు హీరోయిన్లు). హీరోయిన్‌ను చూసి అందమంటే ఇదీ అనుకుంటూ తెగ ఆనందపడిపోతూ ఉంటాడు. ఇక అందమె ఆనందం అంటూ డ్యూయెట్లు, డాన్సులు. ఆ హీరో ఆనందం, ఆటలు, పాటలు, చూసేవాళ్ళకి పెద్ద బోర్. పోనీ ఇంకో సినిమాకి పోదామా అంటే అన్ని సినిమాల గోలా ఇదే!

అబ్బే, అలా బోర్ అనుకోవటానికి వీల్లేదు పొమ్మన్నాయి కొన్ని ఉపనిషత్తులు, ముఖ్యంగా తైత్తిరీయ (బ్రహ్మ-ఆనంద వల్లి), బృహదారణ్యకాలు. ఎవడి పిచ్చి వాడికి ఆనందం అని తెలుసుకోమంటూ అసలు హీరో అంటే ఎవరో నిర్వచించాయి. అతను ఒక మనిషి, పట్టులోఉన్న యువకుడు, ద్రఢిష్ఠుడు, బలిష్ఠుడు, పరమసాధ్వి, బాగా చదువుకున్నవాడు, ఏది ఎప్పుడు అనుభవించాలో అప్పుడు అనుభవించ గలిగినవాడు, ఈ భూలోకంలో ఏది కావలసినా సమకూర్చుకో గలిగినవాడు. ఇక అతనికి చింతలేముంటాయి? అంతా ఆనందమే. అనుభవించటానికి ఇంకేమీ మిగలనందున అతను ఇంతకన్న అనుభవించలేడు, అతనికి ఇంతకన్న ఆనందమన్నది లేదు (మన సినిమా హీరోకి లాగ). అంటే ఇతని ఆనందానికి ఒక అవధి (లిమిట్) ఉందని అర్థమవుతూంది. ఇది మానుషానందం. ఇతని ఆనందాన్ని ఒక కొలమానంగా తీసుకుంటే దీనికి వందరెట్ల ఆనందాన్ని మనుష్య-గంధర్వులు అనుభవించగలరుట. మనుష్య-గంధర్వుల ఆనందానికి మరో వందరెట్లు దేవ-గంధర్వులు, వారి ఆనందానికి మరో వందరెట్లు పితృదేవతలు, వారి ఆనందానికి మరో వందరెట్లు ఆజానజులనే దేవతలు, వారి ఆనందానికి మరో వందరెట్లు కర్మదేవతలు, వారి ఆనందానికి మరో వందరెట్లు దేవతలు, వారి ఆనందానికి మరో వందరెట్లు ఇంద్రుడు,





అతని ఆనందానికి మరో వందరెట్లు బృహస్పతి, అతని ఆనందానికి మరో వందరెట్లు ప్రజాపతి (ఒక బ్రహ్మ), అతని ఆనందానికి మరో వందరెట్లు హిరణ్యగర్భుడు (సృష్టికర్త బ్రహ్మ) అనుభవించగలరు. ఈ చివరి అనుభవం బ్రహ్మానందం. ఈ ఆనందస్వరూపంలో ఉన్నది ఆ పరమాత్మయే (అనుబంధం చూడండి).

అసలు మెరుపు ఇక్కడ ఉంది. అదేమంటే, తైత్తిరియంలో ఇలా ఉంటుంది: "శ్రోత్రియస్య చ అకామహతస్య"; ఈ మాట ప్రతి వందరెట్ల ఆనందానికి చెల్లుతుంది. శ్రోత్రియుడయి, నిష్కామి అయిన వాడికి కూడా ("చ") ఈ ఆనందం లభిస్తుంది.

తైత్తిరీయం (బ్రహ్మ-ఆనందవల్లి-8): "సైషా ఆనందస్య మీమాగ్ంసా భవతి, యువాస్యాత్ సాధు యువా~ధ్యాయకః, ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః, తస్యేయం పృథివీ సర్వ విత్తస్య పూర్ణా స్యాత్, స ఏకో మానుష ఆనందః; శ్రోత్రియస్య చ అకామహతస్య, తే యే శతం మానుష ఆనందాః స ఏకో మనుష్యగన్ధర్వాణాం ఆనందః, శ్రోత్రియస్య చ అకామహతస్య, తే యే శతం ....... తే యే శతం ప్రజాపతేః ఆనందాః స ఏకో బ్రహ్మణ ఆనందః, శ్రోత్రియస్య చ అకామహతస్య; ..... స ఏవం విత్, అస్మాల్లోకాత్ ప్రేత్య ఏతం అన్నమయం ఆత్మానం ఉపసంక్రామతి; ఏతం ప్రాణమయం ఆత్మానం ఉపసంక్రామతి; ఏతం మనోమయం ఆత్మానం ఉపసంక్రామతి; ఏతం విజ్ఞానమయం ఆత్మానం ఉపసంక్రామతి; ఏతం ఆనందమయం ఆత్మానం ఉపసంక్రామతి".

విషయం తెలుసుకున్న నిష్కామ శ్రోత్రియ జ్ఞానికి ఆనందం ఎలా లభిస్తుంది? పంచకోశాంతరస్థితా అనే అధ్యాయంలో చెప్పుకున్నది ఒకసారి జ్ఞాపకం చేసుకుందాం. "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్", "ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్", "మనో బ్రహ్మేతి వ్యజానాత్", "విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్", "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" - తైత్తిరీయ-భృగువల్లి (2). జ్ఞాని లోకాతీతుడై (లౌకిక విషయాసక్తి లేనివాడై) తనలోని పంచకోశాలలోనూ

బ్రహ్మసాక్షాత్కారం చేసుకోగలడు. కానీ అప్పుడుకూడా ఆనందం పొందటం చాలాకష్టమైన పనే. ఎందుకంటే, "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి" – ఆనంద వల్లి (9). అతనికి కూడా, భయమంటే ఉండదుకానీ, వాక్కులు (బాహ్యం), మనసు (అంతరం) అసలు బ్రహ్మస్వరూపాన్ని తెలుకోలేక, పరమానందాన్ని పొందలేక, వెనకకి తిరిగి వచ్చేస్తాయి.

మరెలాగ? జనకసామ్రాట్‌కి యాజ్ఞవల్క్యులు చెప్పినదానికి శంకరులు ఇచ్చిన వివరణ చూసి తెలుసుకుందాం. బృహదారణ్యక (4–3–33): "స యో మనుష్యాణాం రాద్ధః సమృద్ధో భవతి, అన్యేషాం అధిపతిః, సర్వైర్మానుష్యకైర్భోగైః సంపన్నతమః, స మనుష్యాణాం పరమానందో~థ యే శతం మనుష్యాణాం ఆనందాః స ఏకః పితౄణాం ............ యే శతం ప్రజాపతిలోక ఆనందాః స ఏకో బ్రహ్మలోక ఆనందో యశ్చ శ్రోత్రియో~వృజినో~కామహతో అథైష ఏవ పరమానంద ఏష బ్రహ్మలోకః, సమ్రాట్ ...". దీనికి శంకరుల వివరణ: "ఏవం శతగుణోత్తరోత్తరవృద్ధ్యుపేతా ఆనందా యత్రైకతాం యాన్తి, యశ్చ శ్రోత్రియ ప్రత్యక్షో~థైష ఏవ సంప్రసాదలక్షణః పరమానందః. తత్ర హి నాన్యత్ పశ్యతి, నాన్యత్ శృణోతి, అతో భూమా; భూమత్వాత్ అమృతః, ఇతరే తద్విపరీతాః". పాపరహితుడు, కామరహితుడు, శ్రోత్రియుడు అంతర్ముఖుడయి భూమాస్థితికి చేరగా పరమానందాన్ని పొంది మరేమీ చూడడు, మరేమీ వినడు. "**మునిమానసహంసికా**" అని అమ్మవారి నామం. భూమా అంటే ఏమిటో "**భూమరూపా**" అనే అధ్యాయంలో తెలుసుకుందాం.

మానుషానందంనుంచి మెట్టుకి వందేసి రెట్లుగ ఆనందం పెరుగుతూ పది మెట్లు ఎక్కితే బ్రహ్మానందం తెలుస్తుంది (అదేమీ తక్కువ సంఖ్య కాదు; ట్రిలియన్ టైమ్స్ అవుతుంది). ఈ ఆనందాలన్నింటినీ కలిపితే ఇంకా ఎక్కువ. అమ్మవారి ఆనందంతో (స్వాత్మానందం – లలితానందం) కంపేర్ చేస్తే (పోలిస్తే) ఈ బ్రహ్మాది ఆనందాలన్ని కలిపిన మూట ఒక లవలేశం





పాటుట! ఆ విధంగా "**స్వాత్మానంద లవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః, పరమానందా, సత్యజ్ఞానానందరూపా, ఆనందకలికా, పరమోదారా, పరామోదా, స్వాత్మారామా**" అయింది ఆమె.

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ లలితాంబికాయై నమః.

---

అనుబంధం

కొన్ని దశాబ్దాల క్రితం, ప్రపంచదేశాలలోని స్యూసైడ్ రేట్‌ల (ఆత్మహత్యల) గురించి ఒక ఇంటర్నేషనల్ సర్వే చేశారు. యూరోప్ లోని అత్యంత సుసంపన్న దేశాలలో ఆత్మహత్యల రేట్ ఎక్కువ అని తేలింది. సుసంపన్న దేశాలలో ఆత్మహత్యలు ఎక్కువ అవటం ఆశ్చర్యం. ఎంక్వయిరీ చేశారు. ఈ దేశాలలో బ్రతకటానికి కావలిసినవన్నీ ఆయా ప్రభుత్వాలు ఆటోమాటిక్‌గా ఏర్పాటు చేసేస్తూండగా, జనాలు జీవితంలో సుఖపడటానికి పెద్దగా కష్టబడ నక్కరలేదని, ప్రత్యేకంగా చేయవలసిన పనీ – పాటా లేక లైఫ్ బోర్ కొట్టేసి ఆత్మహత్యలకి పాల్పడుతున్నారని తెలిసింది.

కష్టపడుతున్నా కలిసిరావట్లేదని మన దేశంలో రైతులు ఆత్మహత్యలకి పాల్పడుతున్నారు!

యోగసూత్రాలు చెప్పిన పంచక్లేశాలలో 'అభినివేశం' మానవులకు ఉండే ఒక క్లేశం. అకారణ–నిష్కారణ మృత్యుభయం అభినివేశం (ఇంకా చాలానే అర్థాలున్నాయి). ఉదాహరణలు: కొందరు లేని రోగాలని తమకి నిజంగా ఉన్నట్లుగా ఊహించుకుంటూ తెగ భయపడుతూ, మిగతావారినికూడా భయపెట్టేస్తూంటారు. నీకే రోగం లేదయ్యా బాబూ అని డాక్టర్ చెప్పితే, ఏ రోగం లేకపోవటం కూడా ఒక రోగమే అంటారు! ఇటువంటివారికి విమానం ఎక్కితే కూలిపోతుందేమోనని భయం; పడవెక్కితే మునిగి

పోతుందేమోనని భయం; వోల్వో బస్సెక్కితే అది మండిపోతుందేమోనని భయం; రైలెక్కితే బోగీలు భగ్గుమంటాయేమోనని భయం. కదిలితే భయం; కదలకపోతే భయం.

యూరపియన్‌లైనా, మన రైతులైనా, అభినివేశులైనా, మరెవరైనా, ఇవి హీరోలకుండవలసిన లక్షణాలు కావు. కానీ, ఎవడి పిచ్చి వాడికి ఆనందం అన్నట్లుగానే, ఎవడి పిచ్చి వాడికి దుఃఖం కూడా.





అధ్యాయము 03

# 3. శ్రీ బహురూపా, భూమరూపా, శ్రీ లలితాంబికా

శ్రీ లలితా సహస్రనామంలోని ఆసక్తికర నామాలలో "**భూమరూపా**" అనే నామం ఒకటి. విషయం తెలిస్తే అన్ని నామాలు ఆసక్తి గలిగించేవే గానీ, ఈ నామానికి ఉన్న ప్రత్యేకత వేరు. "భూమా" అంటే బహుతరమైనది అని ఒక అర్థం. అలా చూస్తే "**బహురూపా**" నామానికి, "**భూమరూపా**" నామానికి తేడా లేదు. కానీ, "భూమ" అంటే మరో విశేషమైన అర్థం ఉంది. అది తెలుసుకోవాలంటే ఉపనిషద్ జ్ఞానం కొంచెం అవసరమవుతుంది.

ఛాందోగ్యోపనిషత్ (7వ అధ్యాయం) లో ఒక మంచి కథ ఉంది. అన్ని శాస్త్రాలు కాచి వడ గట్టేసిన వారు నారదులవారు. అయినా ఆయనకి తృప్తి, శాంతి, సుఖం లేవుట. దారి చూపించరా, సనత్కుమారా అంటూ, ఒక రోజు సనత్‌కుమారుల (సుబ్రహ్మణ్య అవతారమని చెప్తుంటారు) దగ్గరకి వెళ్ళారు. సనత్‌కుమారులు నారదుడిని, దారి చూపించే ముందర నీకింతవరకు ఏమి తెలుసో చెప్పమని అడిగారు. "ఋగ్వేదం భగవో~ధ్యేమి యజుర్వేదం సామవేదమాథర్వణం చతుర్థం ఇతిహాసపురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకోవాక్యం ఏకాయనం దేవవిద్యాం బ్రహ్మవిద్యాం భూతవిద్యాం క్షత్రవిద్యాం నక్షత్రవిద్యాం సర్పదేవజనవిద్యాం ఏతత్ భగవో~ధ్యేమి" – అనగా "స్వామీ, నాకు ఋగ్–యజుర్–సామ–అథర్వణ వేదాలు, ఇతిహాస పురాణాలు, వ్యాకరణం, పితృకల్పం, గణితం, దైవం (సాగర, సునామీ, భూకంప, వర్షపాత, ధూమకేతు, ఉల్కలు, వగైరా), ఆర్థిక – భూగర్భ శాస్త్రాలు, తర్కం, నీతి శాస్త్రం, దేవ–బ్రహ్మ–భూత విద్యలు, ధనుర్వేదం, అంతరిక్ష–జ్యోతి శ్శాస్త్రాలు, సర్ప విద్య, జానపద నృత్య – సంగీతం వగైరా వగైరాలు అన్నీ తెలుసు. అయినప్పటికీ మనస్సుకి శాన్తి లేదు. "మా భగవాన్ శోకస్య పారం తారయతు" – శోకసాగరాన్ని దాటించి, నన్ను గట్టెంకించి, మీరు పుణ్యం కట్టుకోండి – అని ప్రార్థించాడు. అప్పుడు వాళ్ళిద్దరి మధ్య

జరిగిన తతంగం తెలుసుకుందాం.

సనత్కుమారులు నారదుడికి నామ-ఉపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి నామమే బ్రహ్మగా ("నామ బ్రహ్మేతి") గ్రహించి, ఆ ఉపాసన చేసి చూడమన్నారు.

ఈ సలహా నారదుడికి నచ్చలేదు. టెన్త్ క్లాస్ ఎడ్మిషన్ అడిగితే స్కూల్‌వాళ్ళు ఎల్.కె.జి. లో చేర్చుకుంటామన్నట్లుగా ఉంది పరిస్థితి. అడిగిన ఎడ్మిషన్ ఎందుకివ్వరు అంటూ వాదనకి దిగాడు.

నారదులు: "నామ-ఉపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. నామం కన్న వాక్కు గొప్పది. వాక్-ఉపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, వాక్కుని బ్రహ్మగా ("వాచం బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "వాక్-ఉపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. వాక్ కన్న మనస్సు గొప్పది. మనస్-ఉపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, మనస్సుని బ్రహ్మగా ("మనో బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "మనస్-ఉపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. మనస్సు కన్న సంకల్పం గొప్పది. సంకల్ప-ఉపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, సంకల్పాన్ని బ్రహ్మగా ("సంకల్పం బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "సంకల్ప-ఉపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. సంకల్పం కన్న చిత్తం గొప్పది. చిత్త-ఉపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, చిత్తాన్ని బ్రహ్మగా ("చిత్తం బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "చిత్త-ఉపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. చిత్తం కన్న ధ్యానం గొప్పది. ధ్యాన-ఉపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, ధ్యానం బ్రహ్మగా ("ధ్యానం





బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "ధ్యాన-ఉపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. ధ్యానం కన్న విజ్ఞానం గొప్పది. విజ్ఞాన-ఉపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, విజ్ఞానం బ్రహ్మగా ("విజ్ఞానం బ్రహ్మేతి") గ్రహించి, ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "విజ్ఞాన-ఉపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. విజ్ఞానం కన్న బలం గొప్పది. బల-ఉపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, బలం బ్రహ్మగా ("బలం బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "బల-ఉపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. బలం కన్న అన్నం గొప్పది. అన్నోపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, అన్నం బ్రహ్మగా ("అన్నం బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "అన్న-ఉపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. అన్నం కన్న జలం గొప్పది. ఆపోపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, నీరుని బ్రహ్మగా ("ఆపో బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "ఆపోపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. జలం కన్న తేజస్సు గొప్పది. తేజోపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, తేజస్సుని బ్రహ్మగా ("తేజో బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "తేజోపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. తేజస్సు కన్న ఆకాశం గొప్పది. ఆకాశోపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, ఆకాశం బ్రహ్మగా ("ఆకాశం బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "ఆకాశోపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. ఆకాశం కన్న స్మరణం గొప్పది. స్మరోపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, స్మరణం బ్రహ్మగా ("స్మరం బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.

నారదులు: "స్మరోపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. స్మరణం కన్న ఆశ గొప్పది. ఆశోపాసన వలన కలిగే ఫలితాలన్నీ చెప్పి, ఆశను బ్రహ్మగా ("ఆశాం బ్రహ్మేతి") గ్రహించి ఆ ఉపాసన చేసి చూడమన్నారు.
నారదులు: "ఆశోపాసన" కంటె గొప్పది ఇంకేమీ లేదా?
సనత్కుమారులు: లేకేమీ? ఉంది. ఆశ కన్న ప్రాణం గొప్పది.

చివరికి ప్రాణాలమీదకి వచ్చిందే విషయం, అనుకున్న నారదుడు మరేమడగాలో తెలియక మౌనం వహించాడు. సనత్కుమారులుకి నారదుడియందు దయ కలిగింది. ఏమి చెప్పినా అంతకంటే గొప్పది లేదా అని అడుగుతున్నాడంటే నారదుడి తపన చాలా సీరియస్‌గానే ఉందని తలిచి, అసలు విషయం చెప్పేద్దామనుకుని సనత్కుమారులు చెప్పిన విశేషం ఇది: "భూమా" అనే సర్వాతీత పరమార్థ సత్య తత్త్వం తెలిసుకున్నవాడు "అతివాది" అని పిలువబడుతూ సుఖ శాంతులు పొందుతున్నాడు. (**"సర్వాతీతా"** అని అమ్మవారి నామం). "సత్యంత్వేవ విజిజ్ఞాసితవ్యం" – ఆ సత్యమే తెలుసుకో తగినది. తపన పడితేగానీ సత్యాన్ని తెలుసుకోలేవు. "కృతి" (ఇంద్రియ సంయమం, చిత్తైకాగ్రత) ఉంటే నిష్ఠ, నిష్ఠతో శ్రద్ధ, శ్రద్ధతో మననము (మానసిక స్మరణ), ఇవన్నీ చేర్చుకుని కష్టపడితే "భూమా" అనే సత్య తత్త్వ విజ్ఞానం కలిగి శాంతియుత సుఖం లభిస్తుంది. "యదా వై సుఖం లభతే అథ కరోతి, న అసుఖం లబ్ధ్వా కరోతి, సుఖమేవ లబ్ధ్వా కరోతి సుఖం త్వేవ విజిజ్ఞాసితవ్యం ..." – ఎవరేపని చేసినా సుఖం కోసమే. అందుచేత సుఖం కావాలనే ఆశతో కష్టపడు. అసలు సుఖమంటే "భూమా"యే సుమా!

భూమా అంటే ఏమిటో నారదుడికి తెలవదు. మరింత వివరంగా చెప్పమని ప్రార్థించాడు. సనత్కుమారుల వివరణ: "యో వై భూమా తత్సుఖం, నాల్పే సుఖమస్తి, భూమైవ సుఖం, భూమాత్వేవ విజిజ్ఞాసితవ్య ..." అసలు సిసలు సుఖం, భూమా. అల్పమైనవాటి వేటిలోను లేని సుఖం భూమా. "యత్ర నాన్యత్పశ్యతి, నాన్యత్ శృణోతి, నాన్యత్ విజానాతి, స





భూమా; అథ యత్ర అన్యత్ పశ్యతి, అన్యత్ శృణోతి, అన్యత్ విజానాతి తదల్పం; యో వై భూమా తదమృతం; అథ యదల్పం తన్మర్త్యం" – భూమా స్థితిలో ఉన్నవాడు ఇతరమైనదేదీ చూడడు, వినడు, తెలుసుకోడు. అల్పసుఖంలో ఉన్నవాడికి ఆ స్థిరత్వం ఉండదు. భూమా అమృతమయము; అల్పం మర్త్యం. భూమా ఏ ఫలానా చోటనో దొరికే ద్రవ్యం కాదు. భవబంధాలను విడిపించుకున్న ఆత్మ ఏవిధంగా పైన, క్రింద, ఇటూ, అటూ, ముందర, వెనుకా, అన్నిచోట్లా ఉంటూ స్వేచ్ఛను ఆనందిస్తూంటుందో అటువంటి స్థితి భూమానంద స్థితి. ఆ ఆత్మానందం భూమ. ఓ నారదా, నీకు తెలుసునని ముందర నువ్వు చెప్పుకున్న ఆ శాస్త్రాలన్నీ 'నాం–కే–వాస్తే' శాస్త్రాలే తప్ప, అవేమీ నిన్ను భూమా స్థితికి చేర్చలేవు. ఆహారశుద్ధి, అంతఃకరణశుద్ధి ప్రథమావశ్యకతగా కలిగి ఉన్నవారే ఆ స్థితికి చేరుకోగలరు. ఈ విషయం తెలిసినవారు "అతివాదులు", "స్వరాట్"లు; తెలవనివారు "అన్యరాజులు", లేక "అన్యరాట్"లు. (భూమా గురించి బ్రహ్మసూత్రాలలోని భూమాధికరణం కూడా వివరిస్తుంది; పెన్నెలకంటి సుందరరామశర్మగారి "బ్రహ్మ సూత్రార్థచంద్రిక"లోని వివరణ తెలుగులో చాలా బాగుంటుంది).

తను చదువుకున్న శాస్త్రాలుకి ఔట్ ఆఫ్ సిలబస్ అయి, వేటిలోను చెప్పని అసలు విషయం సనత్కుమారుల ద్వారా తెలుసుకున్న నారదుడికి ఇప్పుడు తృప్తి కలిగింది. అద్వైత చిన్తనంతా ఈ నాలుగు అక్షరాల నామంలో దాగుంది.

భూమా అన్నది పరమాత్మతో తాదాత్మ్యస్థితిని తెలిపే ఒక యోగం. కొన్ని ఉదాహరణలతో ఆ స్థితిని అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చేద్దాం. అప్సరసలు ఆకాశగంగలో జలకాలాడుతూండగా అటుగా శుకమహర్షి వెళ్ళటం జరిగింది. ఆ మహర్షి రావటం, వెళ్ళటం అప్సరసలు నోటీస్ చేసినా వాళ్ళ ఆటలేవో వాళ్ళు ఆడుకుంటూనే ఉన్నారు. ఆయన వెళ్ళిపోయారు. కాసేపటికి ఆయన తండ్రి వ్యాసులవారు కూడా శుకమహర్షిని వెతుక్కుంటూ అటుగా వచ్చారు. వెంటనే అప్సరసలు

సిగ్గుతో గబగబా గంగనుంచి బయటికి వచ్చి బట్టలు కట్టుకున్నారు. నిజానికి సిగ్గుపడినది అప్సరసలు కాదు; తనకీ తనపుత్రుడికీ ఉన్న వ్యత్యాసం తెలుసుకున్న వ్యాసుడు సిగ్గుపడ్డాడు. అప్సరసలు సరస్సులో నగ్నంగా జలక్రీడలాడుకుంటున్నారని, అసలు వాళ్ళు అక్కడ ఉన్నారని, వాళ్ళ అందచందాలు, ఇవన్నీ శుకమహర్షి చూడరు; చూసినా ఆయనకి ఏ విధమైన స్ఫూర్తి కలగదు. ఆ మహర్షి లోకం వేరు; అప్సరస లోకం వేరు. అందుచేత ఆయన అటుగా రావటం వెళ్ళటం అప్సరసలకేమీ ఇబ్బంది కలిగించే విషయం కాదు. వ్యాసులవారి సంగతి వేరు. ఎంత బ్రహ్మర్షి అయినా గతంలో ఒకసారి ఘృతాచి అనే అప్సరసతో స్వేచ్ఛాసంగం కలిగినవారు. ఇప్పుడు తమని నగ్నంగా చూస్తే, కొడుకు సంగతి మర్చిపోయి తమ వెంట పడతారేమో, ఎందుకైనా మంచిది, అని అప్సరసలు వాళ్ళ జాగ్రత్త వాళ్ళు పడ్డారు. శుకమహర్షి యోగస్థాయిని తెలిపే వృత్తాంతమిది.

సుందరకాండ (11) హనుమంతుడి స్థితి వ్యాసులవారికి శుకమహర్షికి మధ్యనుంటుంది. సీతమ్మ తల్లి కోసం లంక వెళ్ళిన తనకి, ముందర కనిపించినవారిలో రాక్షసాంగనలు ఉన్నారు. "కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః, న హి మే మనసః కించిత్ వైకృత్యం ఉపపద్యతే। మనోహి హేతుః సర్వేషాం ఇంద్రియాణాం ప్రవర్తనే, శుభా~శుభాసు అవస్థాసు తచ్చ మే  సువ్యవస్థితం।" మదంతో మత్తెక్కి రావణుడితో సరసాలాడుకున్న స్త్రీలను చూసి తనకి మనోవికారం కల్గలేదు కదా, శుభా~శుభ అవస్థలన్నింటియందు మన ప్రవర్తనని పురిగొల్పేది మనస్సే, తన మనస్సు చెదరకుండా బాగానే ఉందిలే – అనుకుంటూ తనని తనే సమాధానపర్చుకున్నాడు. ఈ సమాధానపరుచుకోవటమనే స్థితి ప్రసక్తి కూడా అక్కరలేని వారు శుకమహర్షి: "నాన్యత్పశ్యతి నాన్యత్ శృణోతి నాన్యత్ విజానాతి స భూమా" – భూమా స్థితిలోని వారి దృష్టికి పరబ్రహ్మమే తప్ప మరేదీ కనిపించదు,  మరేదీ వినిపించదు,  మరేదీ తెలవదు. "యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః, హర్షా~మర్ష భయో~ద్వేగైః ముక్తో యః .. " – హర్ష–అమర్ష–భయ–ఉద్వేగాలనుంచి





విముక్తుడై, ఎవరివలన ఈ లోకానికి (లోకులకి), ఈ లోకం వలన ఎవరికి, ఏ విధమైన ఇబ్బంది లేక ఉన్నాడో – అని  భగవద్గీత (12) చెప్పినదానికి ప్రత్యక్ష ఉదాహరణ శుకమహర్షి భూమా స్థితి. **"స్వాత్మానంద లవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః"** అనే నామం అమ్మవారి ఈ భూమాస్థితిని తెలుపుతుంది (ఈ నామానికి ఉన్న మరెన్నో విశేషాలు ఇంకో అధ్యాయంలో చర్చిద్దాం).

ప్రత్యేక సమయాలను మినహాయించి, భార్యను కూడా నగ్నంగా చూడకూడదని శాస్త్రం. "న నగ్నాం స్త్రియం ఈక్షేయం అన్యత్ర మైథునాత్" – అని గృహస్థ దీక్ష స్వీకరించే ముందర పెళ్ళినాటి ప్రమాణం. కానీ, డిజిటల్ కెమేరాలతో దొంగచాటుగా అమ్మాయిల వీడియోలు తీసి చూసి మురిసిపోతూ, వాళ్ళని బ్లాక్‌మెయిల్ కూడా చేసే ప్రబుద్ధుల గురించిన న్యూస్ రిపోర్ట్‌లు తరచుగా పేపర్లలో చదువుతున్నాం మనం. కొంతమంది కామాతురులు, భామాతురులే గానీ, భూమాతురులు గాలేరు. ఇది మన(స్)స్థితి. మనల్ని ఉద్ధరించమని ప్రార్థిస్తూ,

ఓం బహురూపాయై నమః, ఓం భూమరూపాయై నమః,
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ లలితాంబికాయై నమః ।

అధ్యాయము 04

# 4. శ్రీ పరంజ్యోతిః, శ్రీ లలితాంబికా

కన్ను మిన్ను కానక, గట్టెక్కి బయటపడే దారి కనిపించక, తన పనయిపోయిందిక అనుకున్న క్షణాలలో గజేంద్రుడికి "కనిపించిన" పరమాత్మని పోతనగారు ఏ విధంగా చూశారో చూద్దాం: "లోకంబులు లోకేశులు లోకస్థులు దెగినతుదినలోకంబగు పెంజీకటి కవ్వల నెవ్వాండేకాకృతి వెలుగు నతని నే సేవింతున్". ఈ సందర్భంలో గజేంద్రుడికి ఏకాకృతిని వెలిగే పరమాత్మ స్ఫురించటం సహజం. "... పురుషస్య ప్రయతో వాంమనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణస్తేజసి, తేజః పరస్యాం దేవతాయాం" (ఛాందోగ్య–6–8–6) – మరణసమయంలో జీవి వాక్కు మనస్సుయందు, మనస్సు ప్రాణమందు, ప్రాణం తేజస్సునందు, తేజస్సు పరదేవతయందు లయమవుతాయి.

జ్యోతి, అగ్ని, తేజస్, వెలుగు అనే పదాలు ఒకే భావాన్ని, ప్రకాశాన్ని, సూచిస్తాయి. కవులు, జ్ఞానులు, ఋషులు పరమాత్మని దయ (ఆర్ద్రత) గలిగిన, చైతన్యవంతమైన, జ్యోతిస్స్వరూపంగా దర్శించారు. అమ్మవారిని, చిరునవ్వుతో పలకరిస్తున్న జ్యోతిస్స్వరూపంగా తెలియజేస్తూ **"దరహాసోజ్జ్వలన్ ముఖీ, పరంజ్యోతిః, రవిప్రఖ్యా, మిత్రరూపిణీ, భానుమండల మధ్యస్థా, చంద్రమండల మధ్యగా, అజ్ఞానధ్వాన్త దీపికా"** అని నామాలు చెప్పబడ్డాయి. "తామగ్నివర్ణాం, తపసా జ్వలన్తీం, వైరోచనీం, కర్మఫలేషు జుష్టాం, దుర్గాం దేవీం శరణమహం ప్రపద్యే" – అని దుర్గాసూక్తం. "తేజోవతీ, కోటి సూర్యసమప్రభా, వహ్నిరూపా, సతేజా, చన్ద్రసూర్యాగ్ని లోచనా, కరాలీ" అని దుర్గాష్టోత్తర నామాలు.

సూర్యుడు ఒక జ్యోతిస్స్వరూపమని వేరే చెప్పక్కర్లేదు. అథర్వవేదంలోని మహావాక్యోపనిషత్ జ్యోతిర్మండలాన్ని చక్కగా వర్ణిస్తూంది: "విద్యా హి కాండాంతర ఆదిత్యో జ్యోతిర్మండలం గ్రాహ్యం నా~పరం, అసావాదిత్యో బ్రహ్మ ఇతి ..."; "సోహమర్కః పరంజ్యోతిః అర్కజ్యోతిః అహగ్శివః,





ఆత్మజ్యోతిః అహగ్ శుక్రః, సర్వజ్యోతిః అసాద హోం" – అని జ్యోతిర్మండల వర్ణన. బృహదారణ్యకోపనిషత్‌లో (4–3) కూడా వివరంగా ఉంటుంది. "దేదీప్యమానోజ్జ్వలా", "గాయత్రీ ప్రణవాక్షర అమృతరసః పూర్ణానుసన్ధీకృతా", "ఓంకారీ" అని శ్రీ రాజరాజేశ్వరి స్తోత్రం. గాయత్రీ మన్త్రానికి "ఓం ఆపో జ్యోతి రసో~మృతం బ్రహ్మ భూర్భువస్సువరోం" అని అనుసంధానం చేస్తారు – భానుమండలంలోని తేజస్సంతా బ్రహ్మస్వరూపమైన ఓంకార రూప అమ్మవారు. కొందరు ప్రతిరోజూ సూర్యుడిని చూసేవరకూ మంచినీళ్ళు కూడా తీసుకోరు.

సూర్యులు కోటి మంది ఒకేసారి వెలిగితే ఎంత కాన్తి ఉంటుందో ఊహకందనిది. కోటిసూర్య సమప్రభులుగా దైవాన్ని వర్ణిస్తున్న సహస్రాలు, అష్టోత్తరాలు చాలానే ఉన్నాయి. ఎక్కడ చూసినా ఆ పరమాత్మ జ్యోతిస్స్వరూపమే: "సుజ్యోతిస్త్వం పరంజ్యోతిః ఆత్మజ్యోతిః సనాతనః, జ్యోతిర్లోకస్స్వరూపస్త్వం జ్యోతిర్జ్ఞో జ్యోతిషామ్ పతిః" అని నృసింహ సహస్రం. "అన్తర్జ్యోతిః బహిర్జ్యోతిః, ప్రత్యగ్ జ్యోతిః పరాత్పరః, జ్యోతిర్జ్యోతిః, స్వయం జ్యోతిః, ఆత్మజ్యోతిః శివోస్మ్యహం" అని శివస్తోత్రం.

ఇలా వెలిగే ఆ పరమాత్మను ఎలా అర్థం చేసుకోవాలి – "కథం ను తద్విజానీయాం కిము భాతి విభాతి వా" – స్వయంగా ప్రకాశిస్తోందా, లేక మరోకాన్తి వలన మెరుస్తోందా – అనే నచికేత ప్రశ్నకు కఠోపనిషత్ (5) జవాబు: " న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం, నేమా విద్యుతో భాంతి కుతో~యమగ్నిః, తమేవ భాన్తమనుభాతి సర్వం, తస్యభాసా సర్వమిదం విభాతి" – ఎవరి కాన్తితోనో తను ప్రకాశించట్లేదు; తనే స్వయంగా ప్రకాశిస్తూ సూర్య–చంద్ర–తారక–అగ్నులను ప్రకాశింపచేస్తూంది; నిజానికి వీరు ప్రకాశించట్లేదు; ఆ పరంజ్యోతి కాన్తియే వీళ్ళందరిది; ఆ జ్యోతే సర్వాన్ని ప్రకాశింపచేస్తూంది. "జ్యోతిషామపి తత్ జ్యోతిః తమసః పరం ఉచ్యతే, జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితం" – (భగవద్గీత–13) – మాయాతీతము, అన్ని జ్యోతులకు జ్యోతి, ఐన ఆ పరంజ్యోతి గురించిన జ్ఞానం తెలుసుకోబడేదిగా, తెలుకోవలసినదిగా,

అందరి హృదయాలలో ప్రతిష్ఠితమై ఉన్నది. "**జ్ఞానముద్రా, జ్ఞానగమ్యా, జ్ఞానజ్ఞేయ స్వరూపిణీ**" అని అమ్మవారి నామాలు.

అలా తను ప్రకాశిస్తూ ఇతరమంతా ప్రకాశింపచేసే పరంజ్యోతి అమ్మ; – "**స్వప్రకాశా, తేజోవతీ, కాన్తిమతీ, ద్యుతిధరా**" – స్వయంగా ప్రకాశించే తేజస్సు ఆమె; "**కాన్తిః, ప్రభారూపా**" కాన్తియే ఆమె రూపం. "**నిజారుణ ప్రభాపూరమజ్జత్ బ్రహ్మాండమండలా**" – అమ్మవారి అరుణకాంతులలో ఈ బ్రహ్మాండ మండలమంతా మునిగిపోయుంది. "తం దేవా జ్యోతిషాం జ్యోతిః ఆయుర్హోపాసతే అమృతం" (బృహదారణ్యక) – ప్రకాశిస్తున్న వాటినన్నింటికి ప్రకాశాన్ని ఇస్తున్న ఆ పరంజ్యోతిని దేవతలు ఉపాసిస్తున్నారు.

ఆ పరమాత్మే సకలజీవులయందు జ్యోతిస్స్వరూపంగా ప్రవేశించి తాను అంతరంగా (అంతర్జ్యోతిగా) పెలుగుతూ, జీవికి పెలుగు కల్పిస్తున్నాడు – "శుక్రేణ జ్యోతీగ్ంషి సమనుప్రవిష్టః, ప్రజాపతిశ్చరతి గర్భే అంతః" – తైత్తిరీయ (నారాయణ ప్రశ్న). "స్వస్థానసంస్థితో దీపః సర్వతో భాసయేద్ యథా, స్థిరస్థాయీ తథా సాక్షీ బహిరంతః ప్రకాశయేత్" (పంచదశీ–10) – స్వస్థానంలో (ఒకచోట స్థిరంగా) ఉన్న దీపం సర్వాన్నీ ఎలా ప్రకాశింపచేస్తుందో అలాగే సాక్షీభూతుడైన ఆ పరమాత్మ తను నిశ్చలంగానే ఉంటూ మన దేహాంతరాన్ని, బయటను, ప్రకాశింప చేస్తున్నాడు. "యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతః పృష్ఠేషు అనుత్తమేషు ఉత్తమేషు లోకేషు ఇదం వావ తద్యదిదం అస్మిన్నంతః పురుషే జ్యోతిః" – ఛాందోగ్య (3–13–7) – అన్నిలోకాలకు పైన ప్రకాశించే దివ్యజ్యోతియే పురుషునిలోపల కూడా జ్యోతిస్స్వరూపమయి ప్రకాశిస్తోంది.

దేహాంతరంలో ఎలా? "నీలతో యదమధ్యస్థాద్ విద్యుల్లేఖేవ భాస్వరా, నీవారశూకవత్ తన్వీ పీతా భాస్వతి అణూపమా, తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః" – నారాయణ సూక్తం (మన్త్ర పుష్పం). హృదయం





మధ్యలో నివ్వరి–వడ్లగింజ ముల్లంత అణురూప సూక్ష్మంగా, పైకి ఎగురుతున్న అగ్నిశిఖ మధ్యలో ఆ పరమాత్మ వ్యవస్థితుడయి ఉన్నాడు. "అంగుష్ఠ మాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి, ... అంగుష్ఠ మాత్రః పురుషో జ్యోతిరివ అధూమకః ...", "అంగుష్ఠమాత్రః పురుషః అంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః ..." – (కఠోపనిషత్–4, 6) – హృదయం మధ్యలో పొగలేని జ్యోతిగా మహాపురుషుడు పెలుగుతున్నాడు.

సనత్కుమారులు నారదుడికి ఇచ్చిన సలహాలలో "తేజో బ్రహ్మేతి" – తేజస్సుని బ్రహ్మగా గ్రహించి ఉపాసన చెయ్యమన్నది ఒకటి. "స యస్తేజో బ్రహ్మేత్యుపాస్తే తేజస్వీ పై స తేజస్వతో లోకాన్ భాస్వతో~పహత తమస్కానభిసిద్ధ్యతి, యావస్తేజసో గతం తత్రాస్య యథాకామచరో భవతి" (ఛాందోగ్య–7) – ఆ ఉపాసకుడు స్వయంగా తేజస్వి అయి అంధకారంలేకుండా ప్రకాశిస్తున్న లోకాలు చేరుకుని, స్వేచ్ఛగా తిరగగలడు.

ప్రతి జీవీ ఒక జ్యోతిస్వరూపమే. ఆ జ్యోతి కాన్తి సన్నగిల్లి నప్పుడు ముఖం పెలవల పోయినట్లుంది అంటాం. అంటే తగినంత ముఖకాంతి, శోభ లేకపోవటం. అయితే ఆమాత్రపు శోభకి మేకప్ చేసుకుంటే చాలదా అనుకోకూడదు! కొంతమంది ఏ మేకప్ చేసుకోకపోయినా బ్రహ్మవర్చస్సుతో పెలిగి పోతూంటారు. దానికి కారణం వారనుసరించే నిష్ఠా గరిష్ఠలు. “దధిక్రావణ్ణో అకార్షం జిష్ణోరశ్వస్య వాజినః, సురభినో ముఖా కరత్ ప్రణ ఆయూగ్ంషి తారిషత్" (మార్జన మన్త్రాలు) – అగ్నిదేవుడు మా ముఖాలను మనోజ్ఞమైనవిగా చేసి మాకు ఆయుష్షుని ప్రసాదించుగాక!

పరంజ్యోతి స్వరూపం సిద్ధించి బ్రహ్మవర్చస్సుతో పెలగటానికి కావలసిన అర్హతలు, తపన, తెలియచేస్తూ హోమాగ్నిహోత్రునికి ఆజ్యాహుతులను సమర్పించటం ఈ క్రింది మన్త్రాలు తెలియజేస్తున్నాయి (తైత్తిరీయ–నారాయణ ప్రశ్న).

"ప్రాణాపాన వ్యానోదాన సమానా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణరేతో బుద్ధ్యాకూతిః సంకల్పా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; త్వక్చర్మ మాగ్ంస రుధిర మేదో మజ్జా స్నాయవః అస్థీని మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; శిరః పాణి పాద పార్శ్వ పృష్ఠోరు ఉదర జంఘ శిశ్నోపస్థ పాయవో మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; ఉత్తిష్ఠ పురుష హరిత పిఙ్గల లోహితాక్షి దేహి దేహి దదాపయితా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; పృథివ్యాపస్తేజో వాయురాకాశా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; శబ్ద స్పర్శ రూప రస గన్ధా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; మనోవాక్కాయకర్మాణి మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; అవ్యక్తభావైః అహంకారైః జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; ఆత్మా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; అన్తరాత్మా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా; పరమాత్మా మే శుద్ధ్యంతాం, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా ; ....... "
– తైత్తిరీయ ఉపనిషత్ – నారాయణ ప్రశ్న (65, 66).

పై మన్త్రాలలో "జ్యోతిరహం భూయాసగ్ం" – అనే మాటలు ముఖ్యం.

విరజా = రజోగుణం నశించినవాడనయి, విపాప్మా = పాప రహితుడనయి, అహం జ్యోతిః భూయాసగ్ం = నేను జ్యోతిస్స్వరూపుడను అయ్యెదనుగాక. నాలోని ప్రాణ–అపాన–వ్యాన–ఉదాన–సమాన వాయువులన్నీ నేను సమర్పించే ఈ ఆహుతులతో శుద్ధి అగుగాక; నా వాక్కు, మనస్సు, కళ్ళు, చెవులు, నాలుక, ముక్కు, రేతస్సు, బుద్ధి, ఆకూతి, సంకల్పం, ఇవన్నీ ఈ ఆహుతులతో శుద్ధి అగుగాక. నా త్వక్చర్మాలు, మాంసం, రక్తం, మేదస్సు, మజ్జ, నరాలు, ఎముకలు, ఇవన్నీ





ఈ ఆహుతులతో శుద్ధి అగుగాక. నా శిరస్సు, చేతులు, పాదాలు, ప్రక్కలు, వీపు, తొడలు, పొట్ట, పిక్కలు, గుహ్యేంద్రియాలు ఇవన్నీ శుద్ధి అగుగాక. నేనాధారపడి బ్రతుకుతున్న పంచభూతాలు శుద్ధి అగుగాక. నా పంచ తన్మాత్రలు శుద్ధి అగుగాక. నాకు త్రికరణ శుద్ధి కలుగుగాక. నేను బయటికి చెప్పని భావాలు, నా అహంకారం శుద్ధి అగుగాక. నా ఆత్మ, అన్తరాత్మ, పరమాత్మ పరిశుద్ధులయి ఉండుగాక. నేను జ్యోతిస్స్వరూపుడను అయ్యెదనుగాక. "సత్యేన లభ్యః తపసాహి ఏష ఆత్మా సమ్యగ్జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యం, అంతశ్శరీరే జ్యోతిర్మయో హి శుభ్రో యం పశ్యంతి యతయః క్షీణదోషాః" (ముండకోపనిషత్–3–1–5) – సత్యం–తపస్సు–జ్ఞానం–బ్రహ్మచర్య నిష్ఠలతో పాపాలు క్షీణమయిన యతులు మనస్సులోనే జ్యోతిర్మయాత్మ సాక్షాత్కారం చేసుకోగలరు.

అందరూ ప్రతిరోజు యజ్ఞాలు, హోమాలు చేసి ఆహుతులనివ్వరు గదా! ఇంటిలో దేవుని దగ్గిర దీపం పెట్టటంలో ఈ పై భావనంతా నిగూఢంగా ఉంటుందని వారు గ్రహించాలి. "ఆర్ద్రం జ్వలతి జ్యోతిరహమస్మి, జ్యోతిర్ జ్వలతి బ్రహ్మాహమస్మి, ..." అనే వేద మంత్రంలోని అంతరార్థం – దయతో నిండిన పరమాత్మ నాలో జ్యోతిస్స్వరూపంగా వెలుగుతున్నాడు; ఆ వెలిగే జ్యోతిర్బ్రహ్మను నేనయ్యున్నాను (అంటే, నాకు ప్రకాశసిద్ధి కలుగుతున్నది). ఇంటిలో దేవుని దగ్గిర దీపం పెట్టినవారికి వర్చస్సు వద్దన్నా వస్తుంది. (ఈ మంత్రాన్ని కొంతమంది ఆచమనం చేసేప్పుడు మననం చేస్తారు; దానికి కారణం ఈ మన్త్రంలోని "అహమేవాహం మాం జ్యోతిర్ జుహోమి స్వాహా" అనే ఆఖరి పాదం.)

కొన్ని ప్రాన్తాలలో ఓ పెద్దదీపాన్ని వెలిగించి ఆ జ్యోతిలోకి అమ్మవారిని ఆవాహన చేసి కొలుస్తారు. లలితాంబిక "**వహ్నిమండల వాసినీ**" – ఆ వహ్ని (అగ్ని) మండల మధ్యలో అమ్మవారు ఉంటుంది. మనం కూడా జ్వాలాతోరణం (రంగసేవ) అని, కార్తీకదీపం అని, దీపాలు పెట్టి, "దీపం జ్యోతి పరంబ్రహ్మం దీపం సర్వతమో~పహం, దీపేన సాధ్యతే సర్వం సంధ్యా దీపం నమో~స్తు తే" అంటూ తులసిమొక్క దగ్గిరో, ఆలయాలలోనో,

గోదావరి – కృష్ణ వంటి పుణ్యానదులలోనో వదుల్తూంటాం గదా! ఇదిగాక, దీపదానం కూడా కొంతమంది చేస్తూంటారు. ఇంటిలో దేవుని దగ్గిర దీపం పెట్టటంతో సహితంగా ఇదంతా తేజోపాసన. సంపదలు కోరుకునేవారిని "ఓం శ్రీం కమలవాసిన్యై నమః" అని చెప్పి శ్రీసూక్త పారాయణ చేస్తూ ఆజ్యం సమర్పించమన్నారు (హోమం చేయటం, లేక దేవుని దీపానికి నూనో నెయ్యో పోయటం). "యశ్శుచిః ప్రయతో భూత్వా జుహుయాదాజ్యమన్వహం, శ్రియః పంచదశర్చం చ శ్రీకామః సతతం జపేత్. చంద్రాభాం లక్ష్మీం ఈశానాం సూర్యాభాం శ్రియం ఈశ్వరీం, చంద్రసూర్యాగ్ని వర్ణాభాం శ్రీ మహాలక్ష్మీం ఉపాస్మహే" – ఆ మహాలక్ష్మి చంద్ర–సూర్య–అగ్నిల కాన్తితో ప్రకాశిస్తున్నదిట. "సంపత్స్వరూపాం జ్యోతిర్మయాంగీం జ్ఞానాఖ్యదీప్తీం ఆనందదాత్రీం, ఐశ్వర్య సంధాయినీం దీపలక్ష్మీం కాయేన వాచా మనసా స్మరామి" – ఐశ్వర్యానాందాలనిచ్చే దీపలక్ష్మికి అన్నివిధాలా నమస్కారం. "ధనమిచ్ఛేత్ హుతాశనాత్" – అగ్నిదేవుని దయతో ధనం కలుగుతుంది.

అన్తర్జ్యోతిని పరంజ్యోతితో లయం చెందించటానికి జీవులు పడే యాతనని తెలియజేసేది జ్యోతిశ్శాస్త్రం. "యజ్జాగ్రతో దూరముపైతి దైవం తదు సుప్తస్య తథైవేతి, దూరం గమం జ్యోతిషాం జ్యోతిరేకం, తన్మే మనశ్శివ సంకల్పమస్తు" అని శివ సంకల్పం (ఈ మంత్రానికి పాఠాంతారాలున్నాయి). "అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ" – అనే ప్రార్థన తెలియని వారు ఉండరు (అభ్యారోహ మన్త్రం – బృహదారణ్యక 1–3–28; "సర్వోపనిషదుద్ఘుష్టా" అనే అధ్యాయం చూడండి). ఉచితానుచిత వివేకం కలిగించే తెలివి తేటలనిచ్చి మన బుర్రలు వెలిగిస్తూ మనని అజ్ఞానాంధకారం నుంచి వెలుగులోకి తీసుకెళ్ళే జ్యోతిస్స్వరూపిణి అమ్మవారు.

"**తారాకాన్తి తిరస్కార నాసాభరణ భూషితా**" తారాకాన్తుల కన్న ఆమె ముక్కుకున్న నత్తు కాన్తి ఎక్కువట. "**నవ విద్రుమ బింబశ్రీ న్యక్కారి రదనచ్ఛదా**" – ఎర్రటి పగడాల కాన్తి కన్న ఆమె పెదవుల కాన్తి ఎక్కువట.





ఆ "**చిదగ్నికుండ సంభూతా, ఉద్యద్భాను సహస్రాభా, అష్టమీచంద్ర విభ్రాజదళికస్థల శోభితా, పద్మరాగ సమప్రభా, తటిల్లతా సమరుచిః, (మెరుస్తున్న దివ్యజ్యోతి), స్వాహా, స్వధా, సర్వవర్ణోప శోభితా,** శ్రీ లలితాంబికకు నమస్కారం.

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ లలితాంబికాయై నమః ।

అధ్యాయము 05

# 5. శ్రీ సర్వోపనిషదుద్ఘుష్టా, శ్రీ లలితాంబికా

ఉపనిషత్తులు పరబ్రహ్మ తత్త్వాన్ని తెలిపే వేదాన్త దర్శనాలు (వేదాల చివరలో వస్తాయి). మన దృక్పథాలను ఈ తత్త్వానికి దగ్గరలో చేర్చి చూపించేది ఉపనయనం. "ఉపనయనం" జీవితంలో ఒకేసారి చేసుకునే పుణ్యకార్యం కాదు. ప్రతిరోజూ త్రిసంధ్యలా చేసే కార్యక్రమం. సన్ధ్యావందనంలో సంకల్పం చేసేప్పుడు "చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థే వినియోగః" అనిగాక "ఉపనయనే వినియోగః" అని చెప్తారు. ఆ బ్రహ్మతత్త్వాన్ని విశదీకరించే ఉపనిషత్తులు, మన సాంప్రదాయంలో 108 ఉన్నాయి (మరో లెక్క ప్రకారం 1108 పైన ఉన్నాయి). వీటిలో ముఖ్యమైనవి వేదాధారాలు. అందుకని ఉపనిషత్తులను వేదాన్తంగా గ్రహిస్తాం. కానీ వేదాలవసరం లేకుండానే పరబ్రహ్మ తత్త్వాన్ని విశదీకరించగలం అనుకునే వాళ్ళుకూడా ఉపనిషత్తులు వ్రాయవచ్చు. అలా అనుకునే మొగల్ చక్రవర్తి అక్బర్ "అల్లోపనిషత్" (దీన్ ఇలాహి) వ్రాశాడు.

108 ఉపనిషత్తులలో ముఖ్యమైనవి 10 (దశ) ఉపనిషత్తులు. అవి 1. ఈశ, 2. కేన, 3. కఠ, 4. ప్రశ్న, 5. ముండక, 6. మాండూక్య, 7. తైత్తిరీయ, 8. ఐతరేయ, 9. ఛాందోగ్య, 10. బృహదారణ్యక.

"తైత్తిరీయ ఉపనిషత్"కి ఆది శంకరులు వ్రాసిన భాష్యాన్ని కనుపర్తి మార్కండేయ శర్మ గారు తెలుగులోకి అద్భుతంగా అనువదించారు. వావిళ్ళ వారిచే ప్రచురింపబడిన ఆ గ్రంథంలోని 'ప్రకాశక విజ్ఞప్తి'లోను, వావిళ్ళ వారి ప్రచురణ "అష్టోత్తరశత ఉపనిషదః" అన్న గ్రంథంలోను, మిగిలిన 98 ఉపనిషత్తుల గురించిన వివరణ ఇలా ఉంది: యోగోపనిషత్తులు 20, సామాన్య వేదాన్తోపనిషత్తులు 24, సన్న్యాసోపనిషత్తులు 17, శైవోపనిషత్తులు 15, వైష్ణవోపనిషత్తులు 14, శాక్తోపనిషత్తులు 8, అని మొత్తం 98 ఉపనిషత్తుల విభజన.





20 యోగోపనిషత్తులు: అద్వయతారక, అమృతనాద, అమృతబిందు, క్షురిక, తేజోబిందు, త్రిశిఖ బ్రాహ్మణ, దర్శన, ధ్యానబిందు, నాదబిందు, పాశుపత బ్రహ్మ, బ్రహ్మవిద్యా, మండల బ్రాహ్మణ, మహా వాక్య, యోగ కుండలి, యోగ చూడామణి, యోగతత్త్వ, యోగశిఖ, వరాహ, శాండిల్య, హంస, ఉపనిషత్తులు (20).

24 సామాన్య వేదాన్తోపనిషత్తులు: అక్షి, అధ్యాత్మ, అన్నపూర్ణ, ఆత్మ, ఆత్మబోధ, ఏకాక్షర, కౌషీతకీ బ్రాహ్మణ, గర్భ, నిరాలంబ, పైంగల, ప్రాణాగ్నిహోత్ర, మన్త్రిక, మహా, ముక్తిక, ముద్గల, మైత్రాయణీ, వజ్రసూచిక, శారీరక, శుకరహస్య, సర్వసార, సావిత్రీ, సుబాల, సూర్య, స్కన్ద, ఉపనిషత్తులు (24).

17 సన్న్యాసోపనిషత్తులు: ఆరుణి, అవధూత, కఠరుద్ర, కుండిక, జాబాల, తురీయాతీతావధూత, నారద పరివ్రాజక, నిర్వాణ, పరబ్రహ్మ, పరమహంస పరివ్రాజక, పరమహంస, బ్రహ్మ, భిక్షుక, మైత్రేయీ, యాజ్ఞవల్క్య, శాట్యాయనీయ, సన్న్యాస, ఉపనిషత్తులు (17).

15 శైవోపనిషత్తులు: అక్షమాలిక, అథర్వశిరస్, అథర్వశిఖ, కాలాగ్నిరుద్ర, కైవల్య, గణపతి, జాబాలి, దక్షిణామూర్తి, పంచబ్రహ్మ, బృహత్ జాబాల, భస్మ జాబాల, రుద్ర హృదయ, రుద్రాక్ష జాబాల, శరభ, శ్వేతాశ్వతర, ఉపనిషత్తులు (15).

14 వైష్ణవోపనిషత్తులు: అవ్యక్త, కలిసంతారణ, కృష్ణ, గరుడ, గోపాల తాపినీ, తారసార, త్రిపాద్విభూతి మహానారాయణ, దత్తాత్రేయ, నారాయణ, నృసింహతాపినీ, రామతాపినీ, రామరహస్య, వాసుదేవ, హయగ్రీవ, ఉపనిషత్తులు (14).

8 శాక్తోపనిషత్తులు: త్రిపుర, త్రిపురతాపినీ, దేవీ, బహ్వృచ, భావన, సరస్వతీ రహస్య, సీతా, సౌభాగ్యలక్ష్మీ, ఉపనిషత్తులు (8)

4 వేదాలు – 108 ఉపనిషత్తులు:

ఋగ్వేదం నుంచి వచ్చినవి:

1 ఐతరేయ ఉపనిషత్ 2 అక్షమాలిక ఉపనిషత్
3 ఆత్మ–బోధ ఉపనిషత్ 4 బహ్వృచ ఉపనిషత్
5 కౌశీతకి–బ్రాహ్మణ ఉపనిషత్ 6 ముద్గల ఉపనిషత్
7 నాదబిందు ఉపనిషత్ 8 నిర్వాణ ఉపనిషత్
9 సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్ 10 త్రిపురా ఉపనిషత్

శుక్లయజుర్వేదం నుంచి వచ్చినవి:

11 అధ్యాత్మ ఉపనిషత్ 12 అద్వయతారక ఉపనిషత్
13 భిక్షుక ఉపనిషత్ 14 బృహదారణ్యక ఉపనిషత్
15 హంస ఉపనిషత్ 16 ఈశావాస్య ఉపనిషత్
17 జాబాల ఉపనిషత్ 18 మండలబ్రాహ్మణ ఉపనిషత్
19 మంత్రిక ఉపనిషత్ 20 ముక్తిక ఉపనిషత్
21 నిరాలంబ ఉపనిషత్ 22 పైంగల ఉపనిషత్
23 పరమహంస ఉపనిషత్ 24 శాత్యయనీయ ఉపనిషత్
25 సుబాల ఉపనిషత్ 26 తారసార ఉపనిషత్
27 త్రిశిఖి బ్రాహ్మణ ఉపనిషత్
28 తురీయాతీత అవధూత ఉపనిషత్
29 యాజ్ఞవల్క్య ఉపనిషత్

కృష్ణయజుర్వేదం నుంచి వచ్చినవి:

30 అక్షి ఉపనిషత్ 31 అమృతబిందు ఉపనిషత్
32 అమృతనాద ఉపనిషత్ 33 అవధూత ఉపనిషత్
34 బ్రహ్మవిద్య ఉపనిషత్ 35 బ్రహ్మ ఉపనిషత్
36 దక్షిణామూర్తి ఉపనిషత్ 37 ధ్యానబిందు ఉపనిషత్
38 ఏకాక్షర ఉపనిషత్ 39 గర్భ ఉపనిషత్
40 కైవల్య ఉపనిషత్ 41 కాలాగ్నిరుద్ర ఉపనిషత్





42 కలి సన్తరణ ఉపనిషత్ 43 కఠ ఉపనిషత్
44 కఠ రుద్ర ఉపనిషత్ 45 క్షురిక ఉపనిషత్
46 మహనారాయణ (యాజ్ఞికి) ఉపనిషత్
47 పంచబ్రహ్మ ఉపనిషత్
48 ప్రాణాగ్నిహోత్ర ఉపనిషత్ 49 రుద్రహృదయ ఉపనిషత్
50 సరస్వతి రహస్య ఉపనిషత్ 51 శరీరక ఉపనిషత్
52 సర్వసార ఉపనిషత్ 53 స్కంద ఉపనిషత్
54 శుకరహస్య ఉపనిషత్ 55 శ్వేతాశ్వతర ఉపనిషత్
56 తైత్తిరీయ ఉపనిషత్ 57 తేజోబిందు ఉపనిషత్
58 వరాహ ఉపనిషత్ 59 యోగ కుండలిని ఉపనిషత్
60 యోగశిఖ ఉపనిషత్ 61 యోగతత్త్వ ఉపనిషత్

సామవేదం నుంచి వచ్చినవి:

62 ఆరుణి (ఆరుణేయి) ఉపనిషత్ 63 అవ్యక్త ఉపనిషత్
64 ఛాందోగ్య ఉపనిషత్ 65 దర్శన ఉపనిషత్
66 జాబాలి ఉపనిషత్ 67 కేన ఉపనిషత్
68 కుండిక ఉపనిషత్ 69 మహా ఉపనిషత్
70 మైత్రాయణి ఉపనిషత్ 71 మైత్రేయ ఉపనిషత్
72 రుద్రాక్ష జాబాల ఉపనిషత్ 73 సన్న్యాస ఉపనిషత్
74 సావిత్రి ఉపనిషత్ 75 వజ్రసూచిక ఉపనిషత్
76 వాసుదేవ ఉపనిషత్
77 యోగ చూడామణి ఉపనిషత్

అథర్వవేదం నుంచి వచ్చినవి:

78 అన్నపూర్ణ ఉపనిషత్ 79 అథర్వశిఖ ఉపనిషత్
80 అథర్వశిరస్ ఉపనిషత్ 81 ఆత్మ ఉపనిషత్
82 భస్మ జాబాల ఉపనిషత్ 83 భావన ఉపనిషత్
84 బృహద్ జాబాల ఉపనిషత్ 85 దత్తాత్రేయ ఉపనిషత్
86 దేవి ఉపనిషత్ 87 గణపతి ఉపనిషత్

88 గరుడ ఉపనిషత్ 89 గోపాల తాపనీయ ఉపనిషత్
90 హయగ్రీవ ఉపనిషత్ 91 కృష్ణ ఉపనిషత్
92 మహావాక్య ఉపనిషత్ 93 మాండూక్య ఉపనిషత్
94 ముండక ఉపనిషత్ 95 నారద పరివ్రాజక ఉపనిషత్
96 నృసింహ తాపనీయ ఉపనిషత్ 97 పరబ్రహ్మ ఉపనిషత్
98 పరమహంస పరివ్రాజక ఉపనిషత్
99 పాశుపత బ్రాహ్మణ ఉపనిషత్ 100 ప్రశ్న ఉపనిషత్
101 రామ రహస్య ఉపనిషత్ 102 రామ తాపనీయ ఉపనిషత్
103 శాండిల్య ఉపనిషత్ 104 శరభ ఉపనిషత్
105 సీత ఉపనిషత్ 106 సూర్య ఉపనిషత్
107 త్రిపద్విభూతి మహానారాయణ ఉపనిషత్
108 త్రిపుర తాపిని ఉపనిషత్

విశ్వాన్ని అర్థం చేసుకోవటం (ఆ అవసరముందా, అని కొంతమంది అడగవచ్చు!), దైనందిన జీవితంలో మనం పాటించితీరవలసిన దృక్పథం – ఈ రెండింటికి ఉపనిషత్ జ్ఞానం చాలా ఉపయోగిస్తుంది. ధర్మజ్ఞానం, కర్మజ్ఞానం, బ్రహ్మజ్ఞానం కలిగించే ఉపనిషదుపదేశాలు మరేదేశమూ పేటెంట్ చేయలేని భారతీయుల అదృష్ట నిధులు. "**శ్రుతిసీమంత సిందూరీకృత పాదాబ్జధూలికా**" అని అమ్మవారి నామం. వేదాన్గనలు అమ్మవారి పాదాలకి నమస్కారం చేయగా ఆమె పాదధూళి వేదాన్గనల పాపిటకి అంటుకుని సిందూరమై ఉపనిషత్తులయ్యాయిట. This is very apt and aesthetic description because upanishads are crowning glory of the vedas. ఇప్పుడు ఉదాహరణలుగా కొన్ని ఉపనిషద్ వాక్యాలను పరిశీలిద్దాం.

తైత్తిరీయ: "ఓమితి బ్రహ్మ, ఓమితి ఇదగ్ం సర్వం", "స్వాధ్యాయ ప్రవచనే చ" (for own practice & teaching others), "సత్యం వద, ధర్మం చర, ... సత్యాన్న ప్రమదితవ్యం, ధర్మాన్న ప్రమదితవ్యం, కుశలాన్న ప్రమదితవ్యం, భూత్యై న ప్రమదితవ్యం, స్వాధ్యాయప్రవచనాభ్యాం న





ప్రమదితవ్యం, దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యం, మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని, నో ఇతరాణి", "శ్రద్ధయా దేయం, అశ్రద్ధయా అదేయం, శ్రియా దేయం, హ్రియా దేయం, భియా దేయం, సంవిదా దేయం" "బ్రహ్మవిదాప్నోతి పరం, ... సత్యం, జ్ఞానం అనంతం బ్రహ్మ .... అయం ఆత్మా", "విజ్ఞానం యజ్ఞం తనుతే, కర్మాణి తనుతే~పి చ", "అన్నం బ్రహ్మేతి ... ప్రాణో బ్రహ్మేతి ... మనో బ్రహ్మేతి ... విజ్ఞానం బ్రహ్మేతి, ... ఆనందో బ్రహ్మేతి ... ", "అన్నం న నింద్యాత్ ... అన్నం న పరిచక్షీత ... అన్నం బహు కుర్వీత ... న కంచన వసతౌ ప్రత్యాచక్షీత ... తద్ వ్రతం ... అహమన్నమహమన్నమహమన్నం, అహమన్నాదోహమన్నాదోహమన్నాదః ...". (అనుబంధం చూడండి.)

ఈశావాస్య: "ఈశావాస్యమిదం సర్వం యత్ కించ జగత్యామ్ జగత్, తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ ధనం" – ఈ జగత్తంతా ఈశ్వరుడి ప్రోపర్టీ; ఆయన నీకు కేటాయించిందే అనుభవించు; ఇతర ధనానికి ఎప్పుడూ దురాశ చూపకు. "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" – నీ కర్మలు నీవు చేస్తూ వందేళ్ళూ బ్రతకాలని కోరుకో. "యస్తు సర్వాణి భూతాని అన్యాత్మన్యేవానుపశ్యతి, సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే" – అందరిలోను ఆ పరమాత్మను చూడగలిగితే ద్వేషం అన్నది ఉండదు. "విద్యాం చ అవిద్యాం చ యస్తద్ వేద ఉభయం సహ, అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృతం అశ్నుతే" – విద్య, అవిద్య రెండూ తెలిసినవారు అవిద్య వలన కలిగే మృత్యువుని దాటి విద్యతో కలిగే అమృతాన్ని అనుభవిస్తారు. "ఓం క్రతో స్మర, కృతం స్మర, క్రతో స్మర, కృతం స్మర" – ఓ జగన్నాథ, యజ్ఞాలను జ్ఞాపకముంచుకో, నేను చేసినదంతా జ్ఞాపకముంచుకో. (త్యాగరాజు రాముడిని "చేసినదెల్లా మరచితివో ఓ రామరామ" అని నిలదీయ లేదూ!)

ముండకోపనిషత్: "కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి?" – ఏ విషయం తెలుసుకుంటే సర్వమూ (జగత్తంతా)

nssnarayana: SrImAta nissIma mahima (2014)

తెలుసుకోబడుతుంది? శౌనకుడు అంగిరస మహర్షిని అడిగిన ఈ గహనమైన ప్రశ్న చాలా ప్రసిద్ధి పొందింది. "కాలీ కరాలీ చ మనోజవా చ సులోహితా యా చ సుధూమ్రవర్ణా, స్ఫులింగినీ విశ్వరుచీ చ దేవీ లేలాయమానా ఇతి సప్త జిహ్వాః" – ఈ ఏడూ అగ్నికున్న నాలుకలు. "అవిద్యాయామంతరే వర్తమానాః స్వయం ధీరాః పండితం మన్యమానాః, జంఘన్యమానాః పరియంతి మూఢా అంధేనైవ నీయమానా యథాంధాః" – కొందరు మూర్ఖులు పండితులమని చెప్పుకుంటూ తిరుగుతూంటారు; పరిస్థితి గ్రుడ్డివాళ్ళని గ్రుడ్డివాడు నడిపిస్తున్నట్లవుతుంది. "సత్యమేవ జయతే నా~నృతం". "కామాన్ యః కామయతే మన్యమానః స కామాభిర్జాయతే తత్ర తత్ర" – కోరికలు ఎక్కడ తీర్చుకోవాలనుకుంటారో జీవులు అక్కడనే పుట్టుతూంటారు. "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి".

మాండూక్యోపనిషత్: "సర్వమ్ హ్యేతద్ బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, ..."; 'అయమాత్మా బ్రహ్మ' అన్నమాట మహావాక్యం. "అకార ఉకారో మకార ఇతి" (ఓం); "అమాత్రశ్చతుర్థః అవ్యవహార్యః ప్రపంచోపశమః శివః అద్వైతః ఏవం ఓంకార ఆత్మైవ". 12 మన్త్రాలే కలిగిన ఈ అతి చిన్న ఉపనిషత్ అద్వైత బీజం నాటి, అప్పటివరకు ఉన్న భారతీయ తాత్త్విక చింతనని మరో మార్గంలోకి తీసుకెళ్ళింది. దీనికి గౌడపాదులవారు వ్రాసిన "మాండూక్య కారిక" చదివితీరవలసిన మహత్తర విమర్శ గ్రంథం. ఆ తరువాత ఆది శంకరులు అద్వైత తత్త్వాన్ని ఈ నాటికీ తార్కికంగా గానీ, తత్త్వపరంగా గానీ కొట్టేయలేని మహావృక్షంగా పెంచిపోషించి, ప్రపంచ తాత్త్విక జగత్తునంతా వెలిగించారు.

ఛాందోగ్యోపనిషత్: ఆసక్తికరమైన కథలున్నది ఈ ఉపనిషత్. ఆరుణీ (ఉద్దాలక) – శ్వేతకేతుల సంభాషణలు ముఖ్యం. తండ్రి కొడుకుకి పాఠాలు చెప్తూండగా, కొడుకు అర్థం కాలేదు, మళ్ళీ చెప్పు, మళ్ళీ చెప్పు అని శ్రమచేస్తూండగా ఫలించిన మహావాక్యం 'తత్త్వమసి': "స యేషో~ణిమా ఐ తదాత్మ్యమిదం సర్వం, తత్సత్యం, స ఆత్మా తత్త్వమసి, శ్వేతకేతో ఇతి భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయతు ఇతి తథా సోమ్యేతి హోవాచ"





(ఛాందోగ్య–6–8–7). ఈ ఉపనిషత్ "భూమా" స్థితిని అద్భుతంగా వివరించింది.

ఐతరేయోపనిషత్: "ఆత్మా వా ఇదమేక ఏవ అగ్ర ఆసీత్" అని మొదలుపెట్టి, జన్మరహస్యాలను ఫండమెంటల్ ప్రశ్నలుగా పోజ్ చేసి చాలా ఆసక్తికరంగా సమాధానాలనిస్తుంది ఈ ఉపనిషత్. చివరికి అసలు అడగవలసిన ప్రశ్న: "కో~యమాత్మేతి – ఈ ఆత్మ ఏమిటి? ఎప్పుడైనా చూశారా, విన్నారా, వాసన వలన తెలిసిందా, ఉపన్యాసాలేమైనా ఇచ్చిందా, తీయగానో చేదుగానో ఉంటుందని రుచి చూశారా?" అని అడిగి, ప్రజ్ఞానమంటే తెలిపి, స్థావర–జంగమాత్మక జగత్తంతా బ్రహ్మ ప్రజ్ఞానం అని నిర్ణయిస్తుంది – "ప్రజ్ఞానే ప్రతిష్ఠితం, ప్రజ్ఞానేత్రో లోకః, ప్రజ్ఞా ప్రతిష్ఠా, ప్రజ్ఞానం బ్రహ్మ". 'ప్రజ్ఞానం బ్రహ్మ' అన్నది మహావాక్యం.

బృహదారణ్యకోపనిషత్: "అథాతః పవమానానామేవ అభ్యారోహః స వై ఖలు ప్రస్తోతా సామ ప్రస్తౌతి స యత్ర ప్రస్తుయాత్ తదేతాని జపేత్, అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ, ఇతి స యదాహాసతో మా సద్గమయేతి ... " – ధర్మ–కర్మ–బ్రహ్మ జ్ఞానాలను ప్రసాదిస్తుంది ఈ ప్రార్థన. "ద్వేవావ బ్రహ్మణోరూపే మూర్తంచైవ అమూర్తం చ మర్త్యం చ అమృతం చ స్థితం చ యచ్చ సచ్చ త్యచ్చ". "ఆత్మనస్తు కామాయ – పతిః ప్రియో / జాయా ప్రియా / పుత్రాః ప్రియాః / విత్తం ప్రియం / పశవః ప్రియాః / బ్రహ్మ ప్రియం / క్షత్రం ప్రియం / లోకాః ప్రియాః / దేవాః ప్రియాః / వేదాః ప్రియాః / భూతాని ప్రియాణి / సర్వం ప్రియం – భవ(ం)తి" – పెళ్ళాంబిడ్డలని ప్రేమించటం తనకోసమేగానీ వాళ్ళకోసం కాదని ఈ ఉపనిషత్‌లో యాజ్ఞవల్క్యుడు లోకంలోని పచ్చినిజం కుండబద్దలు కొట్టినట్లు చెప్పాడు. "సత్యం బ్రహ్మేతి, సత్యం హ్యేవ బ్రహ్మ". "విద్యుత్ బ్రహ్మేతి, విద్యుత్ హ్యేవ బ్రహ్మ". "తదిదం అపి ఏతర్హి య ఏవం వేద అహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి తస్య హ న దేవాశ్చనాభూత్యా ఈశతే " (1–4). 'అహం బ్రహ్మాస్మి' అన్నది మహావాక్యం.

శ్వేతాశ్వతరోపనిషత్: "ఏకో దేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా, కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" (6–11)

కఠోపనిషత్: "ఆశా ప్రతీక్షే సంగతం సూనృతాం చేష్టాపూర్తే పుత్రపశూంశ్చ సర్వాన్ ఏతద్ వృంక్తే పురుషస్య అల్పమేధసో యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే" – అతిథిగా వచ్చిన బ్రాహ్మణుడిని నిరాహారిగా ఉంచిన ఇంటి యజమాని ఆశలు, ఆకాంక్షలు, తను ఇంతవరకూ చేసుకున్న పుణ్యకార్యాల ఫలితము, అంతా నశించిపోతాయి. "... సర్వేంద్రియాణాం జరయంతి తేజః, అపి సర్వం జీవితమల్పమేవ ..." – సర్వేంద్రియాల తేజస్సు క్షీణింపచేస్తూ జీవితం సర్వము అల్పమైనది మాత్రమే. "శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేతః తౌ సంపరీత్య వివినక్తి ధీరః" – ఏది శ్రేయస్సో ఏది ప్రేయస్సో వివేకులు బాగా పరిశీలించి తెలుసుకుంటారు. "ఆశ్చర్యో వక్తా కుశలో~స్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః" – మంచిగురువులకి మంచి శిష్యులు, మంచి శిష్యులకి మంచి గురువులు, దొరకటం చాలా ఆశ్చర్యము. మరణానంతరం జీవుల పరిస్థితి ఏమిటని నచికేతుడు అడగటం, ఆ విషయాన్ని సాక్షాత్తు యమధర్మరాజు తెలియచేయటం నిజంగానే ఆశ్చర్యం. "అణోరణీయాన్ మహతో మహీయాన్ నాత్మాస్య జన్తోర్నిహితో గుహాయాం, తమక్రతుః పశ్యతి వీతశోకో ధాతుప్రసాదాత్ మహిమానం ఆత్మనః" – ప్రాణుల హృదయాలలో సూక్షాతిసూక్ష్మంగా ఉన్న మహాఘనమైన ఆత్మని నిష్కాములు సాక్షాత్కరించుకోగలరు. "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన". "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ తు, బుద్ధింతు సారథిం విద్ధి, మనః ప్రగ్రహమేవ చ". "సో~ధ్వనః పారమాప్నోతి తద్ విష్ణోః పరమం పదం". "సా కాష్ఠా సా పరాగతిః". "అంగుష్ఠమాత్రః పురుషః అంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః ...". "హగ్ంసః శుచిషద్ వసురంతరిక్షసద్ హోతా వేదిషద్ అతిథిః దురోణసద్, నృషద్ వరసద్ ఋుతసద్ వ్యోమసద్ అబ్జా గోజా ఋుతజా అద్రిజా ఋుతం బృహత్". "ఊర్ధ్వమూలః అవాక్‌శాఖః ఏషో~శ్వత్థ స్సనాతనః, తదేవ శుక్రం తద్





బ్రహ్మ తదేవ అమృతముచ్యతే". " ... య ఏతద్ విదుః అమృతాస్తే భవన్తి".

కైవల్యోపనిషత్: "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వమానశుః, పరేణ నాకం నిహితం గుహాయాం విభ్రాజతే యద్యతయో విశంతి" (3)

అమృతబిందూపనిషత్: "మనోహి ద్వివిధం ప్రోక్తం శుద్ధం చాశుద్ధం చ, అశుద్ధం కామసంకల్పం శుద్ధం కామవివర్జితం".

బ్రహ్మోపనిషత్: "స్వయం అమనస్కం అశ్రోత్రం అపాణిపాదం జ్యోతిర్విదితం, యత్ర లోకా నలోకా, దేవా నదేవా, వేదా నవేదా, యజ్ఞా నయజ్ఞా, మాతా నమాతా, పితా నపితా, స్నుషా నస్నుషా, చాండాలో నచాండాలః, పౌల్కసో నపౌల్కసః, శ్రమణో నశ్రమణః, పశవో నపశవః, తాపసో నతాపస ఇత్యేకమేవ తత్ పరంబ్రహ్మ విభాతి నిర్వాణం, న తత్ర దేవా ఋుషయః పితర ఈశతే ప్రతిబుద్ధ్యః సర్వవిద్యేతి, హృదిస్థా దేవతాః సర్వా హృది ప్రాణాః ప్రతిష్ఠితాః, హృది ప్రాణాశ్చ జ్యోతిశ్చ త్రివృత్సూత్రం చ తద్విదురితి, హృది చైతన్యే తిష్ఠతి; యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్, ఆయుష్యం అగ్ర్యం ప్రతిముం చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః".

అమృతనాదోపనిషత్: "అంధవత్ పశ్య రూపాణి శబ్దం బధిరవత్ శృణు, కాష్ఠవత్ పశ్య పై దేహం ప్రశాన్తస్య ఇతి లక్షణం". "భయం క్రోధం అథ ఆలస్యం అతిస్వప్న అతిజాగరం, అత్యాహారం అనాహారం నిత్యం యోగీ వివర్జయేత్" – (అత్యాహారం అనాహారం అన్నారుగానీ, 'అత్యాచారం అనాచారం నిత్యం యోగీ వివర్జయేత్' అనలేదుగదా అని కాబోలు ఈరోజులలో కొందరు 'యోగులు' అత్యాచారాలు చేసి అరెస్ట్ కూడా అయి జైళ్ళ పాలవుతున్నారు!). "ప్రాణ ఆద్యో హృదిస్థానే అపానస్తు పునర్గుదే, సమానో నాభిదేశేతు ఉదానః కంఠమాశ్రితః, వ్యానస్సర్వేషు చాంగేషు వ్యాప్య

తిష్ఠతి సర్వదా". "శాస్త్రాణ్యధీత్య మేథావీ అభ్యస్య చ పునః పునః, పరమం బ్రహ్మ విజ్ఞాయ ఉల్కావత్ తాని అథోత్సృజేత్" – శాస్త్రాలని మరీ మరీ అభ్యసించి పరబ్రహ్మ జ్ఞానాన్ని పొందిన తరువాత మేథావులు ఆ శాస్త్రాలను ఇంక వదిలేయాలి.

సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్: "నిష్కామానామేవ శ్రీవిద్యా సిద్ధిః, న కదాపి న కామానామితి". "**శ్రీ విద్యా**" అని అమ్మవారి నామం.

సరస్వతీ రహస్యోపనిషత్: "ఓం ప్రణో దేవీ సరస్వతీ వాజేభిర్వాజనీవతీ, ధీనాం అవిత్ర్యవతు"; "అనాదినిధనా అనంతా సా మాం పాతు సరస్వతీ"; "చోదయిత్రీ సూనృతానాం చేతంతీ సుమతీనాం యజ్ఞం దధే సరస్వతీ"; "దేవీం వాచమజనయంత దేవా స్తాం విశ్వరూపాః పశవో వదంతి, సా నోమంద్రేషమూర్జం దుహానా ధేనుర్వాగస్మానుపసుష్టు తైతు"; "అంబితమే నదీతమే దేవితమే సరస్వతీ అప్రశస్తా ఇవన్మసి ప్రశస్తిమంబ నస్స్కృధి"; వంటి అమోఘమైన సరస్వతీ మన్త్రాలను (ప్రార్థనలను) తెలుపుతుంది ఈ ఉపనిషత్. విద్యాభిలాషులు అందరికి అవశ్యం. "**అనాదినిధనా, సరస్వతీ**" అని నామాలు.

భావనోపనిషత్: కుండలిని, శ్రీచక్రపూజ, మరెన్నో విశేషాలను తెలుపుతూంది. "**కుండలినీ, శ్రీచక్రరాజనిలయా**" అని అమ్మవారి నామం.

సీతోపనిషత్: "శ్రీరామ సాన్నిధ్యవశాత్ జగదానందకారిణీ, ఉత్పత్తిస్థితిసంహారకారిణీ, సర్వదేహినాం సీతా భగవతీ జ్ఞేయా, మూలప్రకృతిసంజ్ఞితా, ... సా సర్వవేదమయీ, సర్వదేవమయీ, సర్వలోకమయీ, సర్వకీర్తిమయీ, సర్వమయీ, సర్వధర్మమయీ, సర్వాధార కార్యకారణమయీ, మహాలక్ష్మీః, .... సా దేవీ త్రివిధా భవతి శక్త్యాత్మనా, ఇచ్ఛాశక్తి క్రియాశక్తిః సాక్షాచ్ఛక్తిరితి, ఇచ్ఛాశక్తి స్త్రివిధా భవతి, ....". **మూలప్రకృతిః, ఇచ్ఛాశక్తిః, క్రియాశక్తిః, జ్ఞానజ్ఞేయ స్వరూపిణీ** అని అమ్మవారి నామాలు.





అన్నపూర్ణోపనిషత్: "**మన్త్రసారేతి** విశ్రుతా, సప్తవింశతి వర్ణాత్మా, **యోగినీగణసేవితా,** ఐం హ్రీం సౌః శ్రీం క్లీం ఓం నమో భగవత్యన్న**పూర్ణే** మమాభిలషితం అన్నం దేహి స్వాహా, ..... సర్వవస్తు పరిత్యాగే శేష ఆత్మేతి కథ్యతే, ఆత్మావలోకనార్థం తు తస్మాత్సర్వం పరిత్యజేత్". "నిశ్చితా విగతా~భీష్టా **హేయోపాదేయవర్జితా,** బ్రహ్మన్ సమాధిశబ్దేన పరిపూర్ణా మనోగతిః". "న మోక్షో నభసః పృష్ఠే న పాతాళే న భూతలే, సర్వాశాసంక్షయే చేతః క్షయో మోక్ష ఇతీష్యతే". జీవన్ముక్తుడి వర్ణన: " .... నాపేక్షతే భవిష్యచ్చ, వర్తమానే న తిష్ఠతి, న సంస్మరత్యతీతంచ సర్వమేవ కరోతి చ, అనుబంధపరే జంతావసగ్ సర్గమనాస్సదా, భక్తే భక్తసమాచారః, శఠే శఠైవ స్థితః, బాలో బాలేషు, వృద్ధేషు వృద్ధో, ధీరేషు ధైర్యవాన్, యువా యౌవనవృత్తేషు, దుఃఖితేషు సుదుఃఖధీః, ధీరధీః ఉదితానందః పేశలః (చక్కటి నేర్పుగలిగినవాడు) పుణ్యకీర్తనః ప్రాజ్ఞః ప్రసన్నమధురో దైన్యాదపగతాశయః, అభ్యాసేన పరిస్పందే ప్రాణానాం క్షయమాగతే, మనః ప్రశమమాయాతి, నిర్వాణమవశిష్యతే". తత్త్వజ్ఞానం, మనోనాశం, వాసనాక్షయం గురించి చక్కటి పరిశీలనను తెలియచేస్తుంది ఈ ఉపనిషత్. **“హేయోపాదేయవర్జితా, యోగినీగణసేవితా, అన్నదా, పూర్ణా, మన్త్రసారా”** అని అమ్మవారి నామాలు.

త్రిపురాతాపిన్యుపనిషత్: **“.... పరాం భైరవీం చిత్కలాం మహాత్రిపురాం** దేవీం ధ్యాయేత్ మహాధ్యానయోగేన ఇయమేవం వేద ఇతి మహోపనిషత్".

దేవ్యుపనిషత్: "ఏకైవ సర్వత్ర వర్తతే తస్మాదుచ్యత ఏకా, ఏకైవ విశ్వరూపిణీ తస్మాదుచ్యతే అనైకా, అత ఏవ ఉచ్యతే జ్ఞేయా అనన్తా లక్ష్యా చ ఏకా~నైకేతి; మన్త్రాణాం మాతృకా దేవీ శబ్దానాం జ్ఞానరూపిణీ, జ్ఞానానాం చిన్మయాతీతా శూన్యానాగ్ శూన్యసాక్షిణీ, యస్యాః పరతరం నాస్తి సైషా దుర్గా ప్రకీర్తితా". "**ఏకాకినీ, మాతృకా వర్ణరూపిణీ, దుర్గా**" అని అమ్మవారి నామాలు.

సావిత్ర్యుపనిషత్: "కస్సవితా, కా **సావిత్రీ**" అని ప్రశ్నించి రకరకాలుగా సమాధానాలనిస్తుంది. వాటిలో ఒకటి: "మన ఏవ సవితా వాక్సావిత్రీ, స యత్ర మనస్తద్ వాక్ యత్ర వా వాక్ తన్మనః, తే ద్వే యోనిస్తదేకం మిథునం". గాయత్రీ మన్త్రానికి ఆసక్తికరమైన ఇంటర్‌ప్రెటేషన్ ఇస్తుంది.

గాయత్ర్యుపనిషత్: "ప్రథమమాగ్నేయం ద్వితీయం ప్రాజాపత్యం తృతీయం సౌమ్యం చతుర్థమీశానం పంచమం ఆదిత్యం షష్టం బార్హస్పత్యం సప్తమం పితృదైవత్యం అష్టమం భగదేవత్యం నవమం ఆర్యం దశమం సావిత్రం ఏకాదశం త్వాష్ట్రం ద్వాదశం పౌష్ణం త్రయోదశం ఐంద్రాగ్న్యం చతుర్దశం వాయవ్యం పంచదశం వామదైవత్యం షోడశం మైత్రావరుణం సప్తదశం ఆన్గిరసం అష్టాదశం వైశ్వదేవ్యం ఏకోనవింశం వైష్ణవం వింశం వాసవం ఏకవింశం రౌద్రం ద్వావింశం అశ్వినం త్రయోవింశం బ్రాహ్మం చతుర్వింశం సావిత్రం" అని గాయత్రీ మన్త్రాక్షరాల దేవతలు. కానీ ఈ విషయమయి ఏకాభిప్రాయం లేదు; దేవీభాగవతం, పురాణాలు, కొన్ని స్మృతులు వేరే అక్షర దేవతలను పేర్కొన్నాయి.

బహ్వృచోపనిషత్: మొత్తం ఉపనిషత్: "ఓం వాగ్ంమే మనసీతి శాన్తిః. ఓం దేవీ హ్యేకా అగ్ర ఆసీత్, సైవ జగదండమసృజత, **కామకళేతి** విజ్ఞాయతే, శృంగారకళేతి విజ్ఞాయతే, తస్యా ఏవ బ్రహ్మా అజీజనత్, విష్ణురజీజనత్, రుద్రో అజీజనత్, సర్వే మరుద్గణా అజీజనత్, గంధర్వాప్సరస కిన్నరావాదిత్రవాదిన స్సమంతాద్ అజీజనత్, భోగ్యం అజీజనత్, సర్వం అజీజనత్, సర్వం శాక్తం అజీజనత్, అండజం స్వేదజం ఉద్భిజ్జం జరాయుజం యత్కించైతత్ ప్రాణి స్థావర జంగమం మనుష్యం అజీజనత్, సైషా **పరాశక్తిః**, సైషా **శాంభవీ విద్యా, కాదివిద్యేతి వా, హాదివిద్యేతి వా, సాదివిద్యేతి వా**, రహస్యం ఓం ఓం వాచి ప్రతిష్ఠా, సైవ పురత్రయం, శరీరత్రయం వ్యాప్య బహిరంతరవభాసయంతీ, దేశకాలవస్త్వంతరాసంగాత్ **మహా త్రిపురసుందరీ** వై **ప్రత్యక్చితిః**, సైవాత్మా తతోన్యదసత్యమనాత్మా, ఆత్మ ఏషా బ్రహ్మా సంవిత్తిః, **భావాభావకలావినిర్ముక్తా** చిద్విద్యా~ద్వితీయ బ్రహ్మ సంవిత్తిః, **సచ్చిదానందలహరీ, మహాత్రిపురసుందరీ** బహిరంతరం





అనుప్రవిశ్య స్వయం ఏకైవ విభాతి, యదస్తి సన్మాత్రం, యద్విభాతి చిన్మాత్రం, యత్ప్రియం అనందం, తదేతత్ సర్వాకారా మహాత్రిపురసుందరీ, త్వం చ అహం చ సర్వం విశ్వం సర్వదేవతేతరత్ సర్వం మహాత్రిపురసుందరీ, సత్యమేకం **లలితా~**ఖ్యంవస్తు తద్ అద్వితీయం, అఖండార్థం పరంబ్రహ్మ పంచరూప పరిత్యాగాదస్వరూప ప్రహాణతః, అధిష్ఠానం పరం తత్త్వమేకం సచ్ఛిష్యతే **మహదితి**, ప్రజ్ఞానం బ్రహ్మేతి వా – అహం బ్రహ్మాస్మీతి వా – భాష్యతే, తత్త్వమసీత్యేవ సంభాష్యతే, అయమాత్మా బ్రహ్మేతి వా, బ్రహ్మైవాహమస్మీతి వా, యోహమస్మీతి వా, సోహమస్మీతి వా, యా భాష్యతే సైషా, **షోడశీ శ్రీవిద్యా పంచదశాక్షరీ** శ్రీమహాత్రిపురసుందరీ, **బాలాంబికేతి బగళేతి మాతంగీతి** స్వయంవరకల్యాణీతి **భువనేశ్వరీతి చాముండేతి చండేతి వారాహీతి** తిరస్కరణీతి రాజమాతంగీతి వా శుకశ్యామళేతి వా లఘుశ్యామళేతి వా అశ్వారూఢేతి వా ప్రత్యంగిరా ధూమావతీ **సావిత్రీ గాయత్రీ సరస్వతీ** బ్రహ్మానందకళేతి ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధివిశ్వే నిషేదుః, యస్తన్న వేద కిమృచా కరిష్యతి యఇత్తద్విదుః త ఇమే సమాసత ఇత్యుపనిషత్. ఓం వాంమే మనసీతి శాన్తిః" – అని అమ్మవారి గురించి అద్భుతంగా చెప్పింది ఈ ఉపనిషత్.

ఉపనిషత్తులలోని కొన్ని ఆణిముత్యాలను చెప్పుకున్నాం. పైన చెప్పిన ఉపనిషత్తులలోని నాలుగు వాక్యాలు పరబ్రహ్మను గురించిన మహావాక్యాలుగా ప్రసిద్ధి పొందాయి: "తత్త్వమసి" (ఛాందోగ్య), "అహం బ్రహ్మాస్మి" (బృహదారణ్యక), "అయమాత్మా బ్రహ్మ" (మాండూక్య), "ప్రజ్ఞానం బ్రహ్మ" (ఐతరేయ). ఒకే వాక్యంలో చెప్పాలంటే – నీవు, నేను, ఈ కనిపించేది, అంతా ఆత్మస్వరూప పరబ్రహ్మమేనని తెలుసుకోవటం ప్రజ్ఞానం. ('మహావాక్య రత్నావళి'లో 1008 మహావాక్యాలు చెప్పబడ్డాయి – ఇది వ్రాశినదెవరో నాకు తెలవదు.) "**తత్ పద లక్ష్యార్థా, తత్, త్వం, అయీ, తత్త్వమయీ, తత్త్వమర్థ స్వరూపిణీ**" అనే నామాలతో చెప్పబడే అమ్మవారు ఆ పరబ్రహ్మం.

పరబ్రహ్మ అంటే ఓ శివుడో, విష్ణువో, మరొకరో కాదు. ఈ రూపాలన్నీ ఆ పరబ్రహ్మవే. "స బ్రహ్మ, స శివః, స హరిః, సేన్ద్రః, సో~క్షరః, పరమస్స్వరాట్" అని శ్రుతి. "ఏకమ్ సత్, విప్రా బహుధా వదన్తి" అని ఋగ్వేదం – ఉన్నదొక్కటే సత్తు; జ్ఞానులు మాత్రం రకరకాలుగా చెప్తారు. మనం శివుడని పిలుచుకుంటామో, విష్ణువని పిలుచుకుంటామో, మరోలాగానో, మన స్వభావరీత్యా మన ఇష్టం. "**సర్వో~పనిషదుద్ఘుష్టా**" అంటే సర్వ ఉపనిషత్తులు ఘోషిస్తున్న అమ్మవారి పరబ్రహ్మ తత్త్వం. 'ఉద్ఘుష్టా' అంటే గట్టిగా నొక్కి వక్కాణించటం. సర్వోపనిషత్ అని ఒక అథర్వవేద–ఉపనిషత్ ఉంది. ఆ ఉపనిషత్ మాత్రంగాక అన్ని ఉపనిషత్తులూ అమ్మవారి పరబ్రహ్మ తత్త్వాన్ని ఘోషిస్తున్నాయి. ఉపనిషత్తులలో చెప్పబడ్డ భావాలు శ్రీ లలితా సహస్రంలోని నామాలుగా ఉన్నాయి. ఈ విధంగా లలితాంబిక "**సర్వోపనిషదుద్ఘుష్టా, శ్రుతిస్స్మృతిః**" (ఈ అధ్యాయం కూడా చూడండి) అయింది.

ఓం శ్రీ సర్వోపనిషదుద్ఘుష్టాయై నమః,
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ లలితాంబికాయై నమః.

---

అనుబంధం

"శ్రద్ధయా దేయం, అశ్రద్ధయా అదేయం, శ్రియా దేయం, హ్రియా దేయం, భియా దేయం, సంవిదా దేయం" అన్న ఉపనిషద్వాక్యానికి వివరణ:

శ్రద్ధయా దేయం, అశ్రద్ధయా అదేయం: తను చేసే అశ్వమేధయాగం చూడటానికి వచ్చినవారికి దశరథుడు చేసిన భోజన మర్యాదలు చూద్దాం; "తథా జానపదస్యాపి జనస్య బహుశోభనం, దాతవ్యం అన్నం విధివత్ సత్కృత్య న తు లీలయా, .... అవజ్ఞయా న దాతవ్యం కస్యచిత్ లీలయాపి వా, అవజ్ఞయాకృతం హన్యాత్ దాతారం నాత్ర సంశయః" (బాలకాండ–13). పెద్ద–చిన్న అనే తేడా లేకుండా, ఆటగా కాకుండా, ఆదరంతో అందరికీ మంచి భోజనాలు పెట్టాలి. గౌరవం లేకుండా ఆటగా





అమర్యాదగా పెట్టినది, అశ్రద్ధగా ఇచ్చినది, ఆ దాత వినాశానికి కారణమవుతుంది – అని జాగ్రత్తలు తీసుకున్నారు.

శ్రియా దేయం: Donation should be given according to the wealth one possesses. వెయ్యి రూపాయిలు ఉన్నప్పుడు ఒక రూపాయి ఇచ్చి, కోటి రూపాయిలు ఉన్నప్పుడు కూడా ఒకే రూపాయి దానం చేయటం తగని పని.

హ్రియా దేయం: ఇంతకన్న ఎక్కువ ఇవ్వలేకపోయానే అని సిగ్గుపడుతూ దానం చేయాలి. బిడియంతో చేసిన ఉసిరికాయ దానం పుచ్చుకుని ఆయింట కనకధార కురిపించారు ఆదిశంకరులు.

భియా దేయం: అతిథిగా వచ్చిన నచికేతుడు తనకోసం వెయిట్ చేస్తూ మూడు రాత్రులు తన ఇంట పస్తులున్నాడని తెలిసిన యమధర్మరాజు, శాపానికి గురి అవుతానేమో అనే భయంతో నచికేతుడికి మూడు వరాలు దానం చేశాడు. వాటిలో ఒక దానం ఫలితమే కఠోపనిషత్.

సంవిదా దేయం: పొట్టివాడు గట్టివాడు; వచ్చిన వామనుడే వాసుదేవుడు; ఈ విషయం తెలుసుకుని దానం చేయాలో వద్దో నిర్ణయించుకో అని శుక్రాచార్యులు బలి చక్రవర్తికి తెలియ చేయవలసి వచ్చింది. వచ్చేవాడు ఇంద్రుడని తెలుసుకుని దానం చేయాలో వద్దో నిర్ణయించుకో అని సూర్యుడు కర్ణుడికి చెప్పవలసి వచ్చింది. పాత్రత–అపాత్రత తెలుసుకుని దానం చేయాలి.

అధ్యాయము 06

# 6. శ్రీ శ్రుతిస్స్మృతిః, శ్రీ లలితాంబికా

"ఏక ఏవ సుహృత్ ధర్మో నిధనేపి అనుయాతి యః, శరీరేణ సమం నాశం సర్వం అన్యత్ హి గచ్ఛతి" – మనుస్మృతి (8–17) – చేసిన ధర్మమొక్కటే మరణానంతరం జీవిని అనుసరిస్తుంది. "ఆచారః పరమోధర్మః సర్వేషాం ఇతి నిశ్చయః" – వశిష్ట స్మృతి (6 – 1). దురాచారాలను వదిలించు కుంటూ, సాంప్రదాయంగా అనుసరిస్తూన్న సదాచారాలే అందరికీ పరమ ధర్మములు. "**శ్రుతిసంస్తుత వైభవా, దురాచారశమనీ, సదాచారప్రవర్తికా, ధర్మిణీ, ధర్మవర్ధినీ, సంప్రదాయేశ్వరీ**" అని అమ్మవారి నామాలు.

స్మృతులే ధర్మశాస్త్రాలు. విడిగా ధర్మశాస్త్రాలని కొందరు వ్రాశినా విషయాన్ని స్మృతులనుంచి గ్రహించి వ్రాశినవే. కొన్ని సంహితలను కూడా స్మృతులుగానే పరిగణిస్తారు. కొన్ని స్మృతులు ప్రత్యేకంగా వైష్ణవ స్మృతులు.

కొన్ని ప్రఖ్యాత స్మృతులు:

1. అంగిర స్మృతి
2. అత్రి స్మృతి
3. ఆపస్తంబ స్మృతి
4. ఔశనస స్మృతి
5. గోభిల స్మృతి
6. దక్ష స్మృతి
7. దేవల స్మృతి
8. ప్రజాపతి స్మృతి
9. బృహద్ యమ స్మృతి
10. బృహస్పతి స్మృతి
11. యమ స్మృతి
12. లఘు విష్ణు స్మృతి
13. లఘు శంఖ స్మృతి
14. లఘు శాతాతప స్మృతి
15. లఘు హారీత స్మృతి
16. లఘు అశ్వలాయన స్మృతి
17. లిఖిత స్మృతి
18. వశిష్ట స్మృతి
19. వృద్ధ శాతాతప స్మృతి
20. వృద్ధ హారీత స్మృతి
21. వేదవ్యాస స్మృతి
22. శంఖలిఖిత స్మృతి
23. శంఖ స్మృతి
24. శాతాతప స్మృతి





25. సంవర్త స్మృతి
26. బౌద్ధాయన స్మృతి
27. భరద్వాజ స్మృతి
28. భృగు స్మృతి
29. దల్భ్య స్మృతి
30. గౌతమ స్మృతి
31. యాజ్ఞవల్క్య స్మృతి
32. కాశ్యప స్మృతి
33. కాత్యాయన స్మృతి
34. కార్ష్ణాజి స్మృతి
35. లౌగాక్షి స్మృతి
36. లోహిత స్మృతి
37. మను స్మృతి
38. మరీచి స్మృతి
39. మార్కండేయ స్మృతి
40. నారద స్మృతి
41. నారాయణ స్మృతి
42. పైథానసి స్మృతి
43. పరాశర స్మృతి
44. పితామహ స్మృతి
45. ప్రాచేతస స్మృతి
46. పులస్త్య స్మృతి
47. ఋష్యశృంగ స్మృతి
48. శబర స్మృతి
49. సాంఖ్య స్మృతి
50. విష్ణు స్మృతి
51. విశ్వామిత్ర స్మృతి
52. వ్యాఘ్రపాద స్మృతి

మనుస్మృతిని గురించి అందరికి తెలిసే ఉంటుంది. ఆ తరువాత బాగా పేరున్న స్మృతులు ఆపస్తంబ, యాజ్ఞవల్క్య స్మృతులు. "శ్రుతిస్మృతి విహితో ధర్మః" అని వశిష్టస్మృతి (1–3) చెప్పినా ధర్మమంటే శ్రుతులు స్మృతులూ చెప్పినదేనని అందరూ ఒప్పుకోలేదు. అన్ని స్మృతులు నిజంగా వేదాధారాలేనా అనే డౌట్ వచ్చింది. పరాశర స్మృతి చాలా వివాదాస్పదమైన స్మృతి (నిషేధించాలని కూడా అభిప్రాయ పడినవారు ఉన్నారు). మను స్మృతి కూడా అభ్యంతరకరమైనదేనని కొంతమంది అభిప్రాయం.

దీనికి కారణం: కేరళ, కన్యాకుమారిల నుంచి కాశ్మీరం వరకు అనేక ప్రాంతాలున్న ఈ బృహత్ భారతదేశంలో అనేకరకాల జనాలు అనేకరకాల ఆచారాలకు అలవాటు పడ్డారు. ఉదాహరణకి: కొన్ని ప్రాంతాలలో మేనకోడలుతో వివాహం తప్పుగాదు; కానీ అన్నిప్రాంతాలలోను అది ఒప్పుకోరు. ఆస్తులని పంచుకోవటానికి పిండాప్రదాన అర్హత ఉండాలి అని

కొన్ని స్మృతులంటే, వారసులెవరైనా సరే ఆస్తిని పంచుకోవటానికి అర్హులే అని కొన్ని, వారసులైనా కాకపోయినా ఆస్తిని సంక్రమించుకుంటే పిండ ప్రదానం చేయవచ్చని (చేసితీరాలని) కొన్ని స్మృతులు చెప్పాయి; ఏకాభిప్రాయం కుదరలేదు. ఈ విషయంలో దక్షిణ భారతదేశానికి, తూర్పు దేశానికి, పశ్చిమ దేశానికి చాలా తేడాలు ఉన్నాయి. సతీసహగమనాన్ని కొన్ని స్మృతులు పొగిడేయగా, మరికొన్ని తిట్టిపోశాయి. కొన్ని స్మృతులు స్త్రీలకు చదువులక్కర్లేదంటే, మరి కొన్ని శాస్త్రాలు తప్పక అవసరమన్నాయి. కొన్ని స్మృతులు ఆడపిల్లలకి ఆస్తి పంచుకునే అర్హత లేదని చెప్పగా, ఆత్మాపై పుత్ర నామాసి అనేకాదు, ఆత్మాపై పుత్రీ నామా కూడా, అందుకని ఆడపిల్లలకి ఆస్తి పంచుకునే హక్కు ఉండే తీరుతుంది అన్నాయి. "యథైవ ఆత్మా తథైవ పుత్రః, పుత్రేణ దుహితా సమా, తస్యాం ఆత్మని తిష్ఠ్యన్తాం" అని మనుస్మృతి. కొన్ని స్మృతులు ఆస్తిలో ఎక్కువ భాగం పెద్దకుమారుడికి చెందాలి అనగా, కొన్ని స్మృతులు తల్లి ఆస్తి కూతుర్లకు మాత్రమే చెందుతుందనగా, కొందరు ఒప్పుకోక నథింగ్ డూయింగ్, అందరూ సమానమే అన్నారు. కొన్ని స్మృతులు బ్లాక్‌మనీని ప్రత్యేకంగా నిర్వచించాయి. పేరుశనగలని, మరమరాలని నైవేద్యంగా కొందరు ఒప్పుకుంటారు; కొందరు అది కూడదంటారు. నెయ్యి, నువ్వులనూనెనే దీపానికి వాడాలి అంటే, ఏ నూనైనా సరే అనేవారు ఉన్నారు. స్మృతులు ఆయాయా ప్రాంతాలకి సరిపోయేలానే ఆచారాలని వ్రాసుకొచ్చాయి. ఏ స్మృతి గూడా మొత్తం భారతదేశానికి సరిపోదు.

అందుకని అన్ని దేశాలలాగ భారతదేశం కూడా స్వాతంత్ర్యానంతరం, అన్నిప్రాంతాలకి సరిపడే కాన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇండియా ప్రత్యేకంగా తయారు చేసుకోవలసి వచ్చింది. కాన్‌స్టిట్యూషన్ కూడా రాజ ధర్మం, దేశ ధర్మం, ప్రజాహక్కులు, ఈ విషయాలకి సంబంధించినంతవరకూ ఒక స్మృతి వంటిదే; కానీ వ్యక్తిగత ప్రవర్తన గురించి చెప్పదు. సాంప్రదాయ స్మృతులు, ఉదయం లేచిన దగ్గిరనుంచి (ఎవరు ఎప్పుడు లేవాలో కూడా), పళ్ళు తోముకోవటం నుంచి, రాత్రి పడుకునేవరకు (ఎలా పడుకోవాలో, ఎలా "పడుకోవాలో" కూడా) ఎప్పుడెప్పుడు ఎలాయెలా వ్యక్తులు





ప్రవర్తించాలో ఆ విధానాలని తెలియజేస్తున్నాయి. స్మృతులకి అక్కరలేని విషయమంటూ ఏమీ లేదు! చేసే ప్రతిపనీ ధర్మమా, అధర్మమా, ఇదే దృక్పథం. "చోదనా లక్షణార్థో ధర్మః" అని మీమాంస శాస్త్రం. కొన్ని స్మృతులు రాజధర్మం, దేశధర్మం గురించి కూడా చెప్పాయి.

కాంట్రవర్షియల్ విషయాల జోలికి పోకుండా, స్మృతులలో చెప్పబడిన కొన్ని ఆసక్తికర దైవసంబంధిత విషయాలను మాత్రం ఉదాహరణలనుగా చూద్దాం.

1. వృద్ధ హారీత స్మృతి:
"శ్రీ రామాయ నమోహ్యేష తారకబ్రహ్మ నామకః, నామ్నాం విష్ణోః సహస్రాణాం తుల్య ఏవ మహామనుః" (6–247).

"అకార ఏవ లుప్యన్తి సర్వ మన్త్రాక్షరాణి హి, అకారో వాసుదేవస్స్యాత్ తస్మిన్ సర్వే ప్రతిష్ఠితం" (10–40).

"ఆయుధాని బ్రువే చైషాం దక్షిణాధః కరాదితః, పద్మం శంఖం తథా చక్రం గదాం కేశవః, శంఖం పద్మం గదాం చక్రం ధత్తే నారాయణో~వ్యయః, మాధవస్తు గదాం చక్రం శంఖం పద్మం బిభర్తి హి, చక్రం గదాం తథా పద్మం శంఖం గోవింద ఏవ చ, గదాం పద్మం తథా శంఖం చక్రం విష్ణుర్బిభర్తి హి, చక్రం శంఖం తథా పద్మం గదాం చ మధుసూదనః, పద్మం గదాం తథా చక్రం శంఖం చైవ త్రివిక్రమః, శంఖం చక్రం గదాం పద్మం వామనో బిభృయాత్ తథా, పద్మం చక్రం గదాం శంఖం శ్రీపతిః శ్రీధరో దధత్, గదాం చక్రం హృషీకేశః పద్మం శంఖం బిభర్తి హి, పద్మనాభస్తథా శంఖం పద్మం చక్రం గదాం ధరేత్, పద్మం శంఖం గదాం చక్రం ధత్తే దామోదరస్తథా, సంకర్షణో గదాం శంఖం పద్మం చక్రం దధాతి హి, వాసుదేవో గదాం శంఖం చక్రం పద్మం బిభర్తి హి, చక్రం శంఖం గదాం పద్మం ప్రద్యుమ్నో బిభృయాత్ తథా, అనిరుద్ధస్తథా చక్రం గదాం శంఖం చ పంకజం, చక్రం పద్మం తథా శంఖం గదాం చ పురుషోత్తమః, పద్మం

గదాం తథా శంఖం చక్రం చ అథోక్షజో ధరేత్, చక్రం పద్మం గదాం శంఖం నరసింహో బిభర్తి హి, అచ్యుతశ్చ గదాం పద్మం చక్రం శంఖం బిభర్తి హి, జనార్దనస్తథా పద్మం శంఖం చక్రం గదాం ధరేత్, ఉపేంద్రస్తు తథా శంఖం గదాం చక్రం చ పంకజం, హరిస్తు శంఖం చక్రం చ పద్మం చైవ గదాం ధరేత్, శంఖం గదాం పంకజం చ చక్రం కృష్ణో బిభర్తి హి, ఏవం చతుర్వింశతి మూర్తీర్ధ్యాత్వా సమర్చయేత్" ॥ (10 – 116–129)

కేశవాది 24 నామాలతో ఆచమనం, పూజలు చేస్తాం. మహవిష్ణువు తన నాలుగు చేతులలో శంఖ–చక్ర–గదా–పద్మాలను ఏయే విధంగా ధరించాడో ఆ ఎరేంజ్‌మెంట్‌ని (పెర్మ్యుటేషన్స్) ఈ నామాలు తెలియచేస్తాయి. 4 చేతులు, 4 ఆయుధాలు అంటే 24 విధాలుగా ఎరేంజ్ చేయవచ్చును. కేశవ నుంచి కృష్ణ వరకు 24 నామాలు.

"**కరాంగులి నఖోత్పన్న నారాయణ దశా~కృతిః, గోవిన్దరూపా, సర్వాయుధధరా, విష్ణుమాయా**" అని అమ్మవారి నామాలు.

2. అత్రిస్మృతి:
"ప్రణవాద్యాస్త్రయో వేదాః ప్రణవే పర్వ్యవస్థితాః, వాంగ్మయం ప్రణవే సర్వం తస్మాత్ ప్రణవమభ్యసేత్, ప్రణవే నిత్యయుక్తస్య సవ్యాహృతి సప్తసు, త్రిపదాయాం చ గాయత్ర్యాం న భయం విద్యతే క్వచిత్, ఏకాక్షరం పరం బ్రహ్మ ప్రాణాయామః పరం తపః, సావిత్ర్యాస్తు పరం నాస్తి, పావనం పరమం స్మృతం, సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం చ శిరస్తథా, త్రిః పఠేత్ ఆయతప్రాణః ప్రాణాయామః స ఉచ్యతే" (1 – 10–12) – కేశవాది నామాలతో ఆచమనం అయిన తరువాత చేసే ప్రణవసహిత గాయత్రి మన్త్ర పఠనాన్ని తెలియచేస్తూంది. "**గాయత్రీ, వ్యాహృతిః, సంధ్యా, సావిత్రీ, సరస్వతీ**" అని అమ్మవారి నామాలు.





3. శంఖ స్మృతి:
"ఓంకారః ప్రణవాఖ్యః, ఓం భూః, ఓం భువః, ఓం స్వః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓం సత్యం ఇతి వ్యాహృతయః, ఓం ఆపో జ్యోతీ రసో~మృతం బ్రహ్మ భూర్భువస్స్వః ఓం ఇతి శిరః, భవన్తి చాత్ర శ్లోకాః, సవ్యాహృతికాం సప్రణవాం గాయత్రీం శిరసా సహ యే జపన్తి సదా తేషాం న భయం విద్యతే క్వచిత్। ... గాయత్ర్యయుత హోమాచ్చ సర్వపాపైః ప్రముచ్యతే ..... అభీష్టం లోకమాప్నోతి ప్రాప్నుయాత్ కామమీప్సితం, గాయత్రీ వేదజననీ గాయత్రీ పాపనాశినీ, గాయత్ర్యాః పరమం నాస్తి దివి చేహ చ పావనం" (12 – 10–14, 23–25). "**శిరస్స్థితా", వేదజననీ**" అని అమ్మవారి నామాలు.

4. బృహద్యమ స్మృతి:
"మానసం వాచికం చైవ కాయికం పాతకం స్మృతం, తస్మాత్ పాపాత్ విశుద్ధ్యర్థం ప్రాయశ్చిత్తం దినే దినే; ప్రాతస్సంధ్యాం సనక్షత్రాం ఉపాస్యామేవ యత్నతః, మధ్యాహ్నే చ తథా రౌద్రీం సాయం చైవతు వైష్ణవీం" (4–49, 50). అమ్మవారు "**పాపనాశనీ, మహాపాతకనాశనీ**". ఆమె సూర్యమండలంలో ఉదయం ఋగ్వేదస్వరూపిణిగా, గాయత్రిగా, బ్రాహ్మీగా ఉంటుంది; మధ్యాహ్నం యజుస్స్వరూపిణిగా, సావిత్రిగా, రౌద్రిగా ఉంటుంది; సాయంకాలం సామవేదస్వరూపిణీగా, సరస్వతిగా, వైష్ణవిగా ఉంటుంది.

గాయత్రీ రహస్యం:
"ప్రాతస్సంధ్యా .... సర్వాభరణభూషితా గాయత్రీ కౌమారీ బ్రాహ్మీ హంసవాహినీ ఋగ్వేదసంహితా బ్రహ్మదేవత్యా ....", "మధ్యాహ్నసంధ్యా .... సర్వాభరణ భూషితా సావిత్రీ యువతీ మాహేశ్వరీ వృషభవాహినీ యజుర్వేదసంహితా రుద్రదైవత్యా .....", "సాయం సంధ్యా ..... సర్వాభరణభూషితా సరస్వతీ వృద్ధా వైష్ణవీ గరుడవాహినీ సామవేదసంహితా విష్ణుదైవత్యా ....". "**సర్వాభరణభూషితా, గాయత్రీ, బ్రాహ్మీ, సావిత్రీ, మాహేశ్వరీ, రౌద్రీ, సరస్వతీ, వైష్ణవీ** అని నామాలు.

5. గోభిల స్మృతి:
"గౌరీ పద్మా శచీ మేధా సావిత్రీ విజయా జయా దేవసేనా స్వధా స్వాహా మాతరో లోకమాతరః, ధృతిః పుష్టిః తథా తుష్టిః ఆత్మదేవతయా సహ గణేశేన అధికాస్త్వేతా వృద్ధౌ పూజ్యాః చతుర్దశ, కర్మాదిషు తు సర్వేషు మాతరః సగణాధిపాః పూజనీయాః ప్రయత్నేన పూజితాః పూజయన్తి తాః, ప్రతిభాసు చ శుభ్రాసు లిఖిత్వా వా పటాదిషు అపి వా అక్షతపుంజేషు నైవేద్యైః పృథగ్విధైః" – (1–11–14). "**పద్మాసనా, విజయా, తుష్టిః, పుష్టిః, ధృతిః, స్వాహా, స్వధా, మేధా, సావిత్రీ, జయా, గౌరీ**", ఇవన్నీ అమ్మవారి నామాలు. ఈ పదునాల్గు మాతృదేవతలు అందరికన్న ముందర పూజింపబడే గణేశునికన్న అధికులు. విగ్రహాలుగా గానీ, లిపిరూపంగా గానీ, చిత్రరూపంగా గానీ అక్షతలతో, నైవేద్యాలతో పూజింపబడవలసినవారు వీరు. అందుకనే ఆచమనంతో శుద్ధిచేసుకుని, ముందర గాయత్రిని తలుచుకుని, తరువాత సంకల్పం, ఆ తరువాత గణేశ ప్రార్థన చేస్తాము. "అనర్హః కర్మణాం విప్రః సంధ్యాహీనో యతస్స్మృతః" (2 – 1) – సంధ్యావార్చక కర్మలుచేసే అర్హత లేదు. "సదోపవీతినా భావ్యం సదా బద్ధశిఖేన చ, విశిఖో వ్యుపవీతశ్చ యత్కరోతి న తత్కృతం" – (1 – 4) – జుట్టు విరబోసుకుని, సరిఅయిన ఉపవీతం లేకుండా కర్మలు చేయకూడదు.

6. ఆపస్తంబ స్మృతి:
"క్రోధయుక్తో యద్యజతే యజ్జుహోతి యదర్చతి, సర్వం హరతి తత్తస్య ఆమకుంభ ఇవోదకం" – (10–9). క్రోధంతో యజ్ఞాలు, హోమాలు, అర్చనలు చేస్తే ఫలితముండదు. "**నిష్క్రోధా, క్రోధశమనీ**" అని అమ్మవారి నామాలు.

7. బౌద్ధాయన స్మృతి:
"నైక వస్త్రో నా~ర్ద్రవాసా దైవాని కర్మాణి అనుసంచరేత్, పితృ సంయుక్తాని చేత్ ఏకేషాం" (2–5–210) – దైవకార్యాలు ఏకవస్త్రంతో, తడివస్త్రాలతో చేయగూడదు; పితృకార్యాలు ఏకవస్త్రంతో చేయవచ్చు.





"పంచ మహాయజ్ఞాః, తాన్యేవ మహాసత్రాణి, దేవయజ్ఞో పితృయజ్ఞో భూతయజ్ఞో మనుష్య యజ్ఞో, బ్రహ్మయజ్ఞ ఇతి" (2–6–1–3). "**పంచయజ్ఞప్రియా**" అని అమ్మవారి నామం. వివిధ శాస్త్రాలలో పేరుపేరుగా పంచయజ్ఞాలు చెప్పబడ్డాయి.

8. దక్ష స్మృతి:
"దేవకార్యస్య సర్వస్య పూర్వాహ్ణో హి తు విధీయతే, దేవకార్యాణి పూర్వాహ్ణే, మనుష్యాణాం చ మధ్యమే, పితౄణాం అపరాహ్ణేతు కుర్యాత్" (2 – 31) – దైవకార్యాలు పొద్దుటనే చేయాలి. "దయా లజ్జా క్షమా శ్రద్ధా ప్రజ్ఞా త్యాగః కృతజ్ఞతా, ఏతే యస్య గుణాః సంతి గృహస్థో ముఖ్య ఉచ్యతే" (2–67). "వాతాహతం తథా చిత్తం తస్మాత్ తస్య న విశ్వసేత్, బహిర్ముఖాని సర్వాణి కృత్వా చాంతర్ముఖాని వై, మనసైవ ఇంద్రియగ్రామం మనశ్చ ఆత్మని యోజయేత్, సర్వభావ వినిర్ముక్తం క్షేత్రజ్ఞం బ్రహ్మణి న్యసేత్" (7 – 19–21). గాలివాటులాటిది చిత్తచాంచల్యం; నమ్మకూడదు. సర్వ బాహ్యేంద్రియాలను అంతరింద్రియమైన మనస్సుతో సహితంగా అంతర్ముఖం చేసి క్షేత్రజ్ఞుడిని బ్రహ్మంలో ప్రతిష్ఠించాలి. ఈ శరీరం క్షేత్రం; అది తెలుసుకున్నవాడు క్షేత్రజ్ఞుడు. "**క్షేత్రస్వరూపా, క్షేత్రేశీ, క్షేత్రక్షేత్రజ్ఞ పాలినీ, క్షేత్రపాలసమర్చితా, అంతర్ముఖ సమారాధ్యా, బహిర్ముఖ సుదుర్లభా, బ్రాహ్మణీ, దయామూర్తిః, కృతజ్ఞా**" అని అమ్మవారి నామాలు.

9. వశిష్ట స్మృతి:
"అద్భిర్గాత్రాణి శుద్ధ్యంతి, మనస్సత్యేన శుద్ధ్యతి, విద్యాతపోభ్యాం భూతాత్మా, బుద్ధిర్జ్ఞానేన శుద్ధ్యతి"( 3 – 56).

"**పంచసంఖ్యోపచారిణీ**" అని అమ్మవారి నామం. గంధ–పుష్ప–ధూప–దీప–నైవేద్యాలు ఐదు ఉపచారాలు. గంట వాయించటం కూడా ఒక ఉపచారమే (అన్ని సమయాలలోను వాయించ కూడదు). ఈ ఉపచారాలని "**పంచ తన్మాత్రసాయకా**" అనే మరో నామంతో అనుసంధానం చేసుకోవచ్చును. శబ్ద–స్పర్శ–రూప–రస–గంధాలు పంచభూతాల (పృథ్వీ–అప్–తేజస్–

వాయు–ఆకాశ) సూక్ష్మరూపాలైన ఐదు తన్మాత్రలు. ధూపం వాసనకి, నైవేద్యం రసానికి, పుష్పం రూపానికి, గంధం స్పర్శకి, గంట చెవులకి, దీపం తేజస్సుకి అనుసంధానం.

ఓం శ్రీ శ్రుతిసంస్తుత వైభవాయై నమః,
ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ లలితాంబికాయై నమః.





అధ్యాయము 07

# 7. శ్రీ భావా~భావ వివర్జితా, శ్రీ లలితాంబికా

భావ వివర్జితా, అభావ వివర్జితా అని అర్థం చేసుకోవాలి. గహన తత్త్వశాస్త్రమయమైనది ఈ నామం. భారతీయ తత్త్వ శాస్త్రంతో పాటు పాశ్చాత్య తత్త్వశాస్త్రంతో గూడా పరిచయముంటే ఈ నామంలోని గంభీరత వ్యక్తమవుతుంది.

భావం అంటే ఉండినది (ఉంటున్నది), తలంపు, కాన్సెప్ట్, ఐడియా. అభావం అంటే లేకపోయినది, లేనిది, అసలు ఏ విధమైన తలంపు కలగకపోవటం. ఈ రెండింటిచేతా కూడా వివర్జితా అయినది అమ్మ శ్రీ లలితాంబిక. ఊహించినట్లు ఉండదు; లేదా అంటే ఉంది; ఉన్నది లేదనటానికి వీల్లేదు. ఉండటం, లేకపోవటం, అనే మన తలంపులకి అతీతమయినది అని అర్థం. నిజానికి ఈ మాత్రమే ఈ నామానికి అర్థం. కానీ అలాగే అర్థం చేసుకుంటే ఈ నామంలోని అసలు విశేషం మిస్సయిపోతాం. ఆ విశేషాల అవగాహనకై మన ప్రయత్నం మనం చేద్దాం.

భావాభావాలను గురించిన అవగాహన వైశేషిక దర్శనం ద్వారా లభిస్తుంది. భారతీయ దర్శనాలలో వైశేషికం (ఔలూక్యం) చాలా ముఖ్యమైనది – "విశేషాయ ప్రభవతి వైశేషికం". "అయం పరమాణుః తత్పరమాణుభిన్నః విశేషాత్". "**పరమాణుః**" అని అమ్మవారి నామం. పరమాణు లక్షణాలే నిత్యమైనవి, శాశ్వతమైనవి అనే విశేషాన్ని అంగీకరించినవారు వైశేషికులు. పరమాణు విశేష వాదాన్ని ప్రతిపాదించిన ఈ దర్శనానికి సూత్రకర్త కణాదుడు. వైశేషిక దర్శనాన్ని వివరిస్తూ వ్రాసిన గ్రంథాలు కొన్ని ఉన్నాయి. వాటిలో శివాదిత్య వ్రాసిన "సప్తపదార్థీ" అనే గ్రంథం ఒకటి (దీనికి మాధవ సరస్వతి "మితభాషిణీ" అనే వ్యాఖ్యానగ్రంథం వ్రాశారు). క్రింద ఇచ్చిన సంస్కృత నిర్వచనాలు, కొన్ని "సప్తపదార్థీ" (స.ప) నుంచి, కొన్ని కణాదుడి వైశేషిక సూత్రాలనుంచి (క.వై.సూ) గ్రహించబడ్డాయి.

"ప్రమితి" అంటే యదార్థ జ్ఞానం. పదార్థజ్ఞానంతో యదార్థ జ్ఞానం పొందవచ్చు. "ప్రమితి విషయాః పదార్థాః, తే చ ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమవాయ అభావాఖ్యాః సప్తైవ" (స.ప) - ద్రవ్యము, గుణము, కర్మ, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము అని ఏడు రకాలుగా పదార్థాలను గుర్తించవచ్చు. వీటిలో మొదటి ఆరూ భావాలు. ఏడవది అభావం. ఇవి సరిగా తెలుసుకుంటే యదార్థజ్ఞానాన్ని పొందుతామని వైశేషిక దర్శనం చెప్తుంది. ముందర "భావం" గురించి తెలుసుకుందాం.

(1) ద్రవ్యం: "తత్ర ద్రవ్యాణి పృథివ్యప్తేజో వాయ్వ్యాకాశ కాలదిగాత్మమనాంసి నవైవ" (స.ప) - పంచభూతాలు (5), కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు - మొత్తం 9 ద్రవ్యాలు (ఆత్మని ఒక ద్రవ్యంగా కొందరు ఒప్పుకోలేదు).

(2) గుణం: "గుణాస్తు రూపరసగంధస్పర్శ సంఖ్యాపరిమాణ పృథక్త్వ సంయోగవిభాగ పరత్వాపరత్వ బుద్ధి సుఖదుఃఖ ఇచ్ఛాద్వేష ప్రయత్న గురుత్వ ద్రవత్వ స్నేహ సంస్కార ధర్మాధర్మ శబ్దాః చతుర్వింశతిరేవ" (స.ప) - ఐదు శబ్దాదులు (5), సంఖ్య, పరిమాణం, సంయోగ-విభాగాలు (2), పృథక్త్వం (వేరువేరుగా ఉండటం), పరత్వా~పరత్వములు (2), ద్రవం, స్నేహం, బరువు, బుద్ధి, సుఖము, దుఃఖము, ఇచ్ఛాద్వేషాలు (2), ప్రయత్నము, ధర్మాధర్మాలు (2), సంస్కారము (వాసనా) - మొత్తం 24 గుణాలు (వీటిలో సంఖ్య, పరిమాణం వంటివి సామాన్య గుణాలు, శబ్ద-గంధ-రూప-రస-స్పర్శాదుల వంటివి విశేష గుణాలు).

(3) కర్మ: "ఉత్క్షేపణమవత్క్షేపణమాకుంచనం ప్రసారణం గమనమితి కర్మాణి" (క.వై.సూ) - ఎగరెయ్యటం, దించటం, ముడవడం, చాచటం, నడవడం - మొత్తం 5 రకాలుగా కర్మలు.

(4) విశేషం: అనేకరకాలుగా ఏర్పడిన ప్రత్యేకత. "విశేషాస్తు యావన్నిత్య ద్రవ్య వృత్తిత్వాత్ అనంతా ఏవ" (స.ప).





(5) సామాన్యం: "సామాన్యం పరం అపరం పరాపరంచేతి త్రివిధం" (స.ప) - పరజాతి, అపరజాతి, పరాపరజాతి అని మూడు విధాలు. విద్యారణ్యులు "సామాన్యం ద్వివిధం పరమపరం చ" అని రెండు విధాలే అన్నారు.

(6) సమవాయం: "సమవాయస్తు ఏక ఏవ"; "నిత్యసంబంధః సమవాయః" (స.ప). సమవాయం అంటే నిత్యసంబంధం. జాతి-వ్యక్తులకి, గుణ-ద్రవ్యాలకి, అవయవ-అవయవిలకి ఉండే సంబంధం సమవాయం. వైయాకరణులు శబ్ద-అర్థాలకున్న సంబంధం సమవాయం అన్నారు.

ప్రతివస్తువూ కూడా ఒక రకమైన పదార్థం. పంచదార, పాలు, కొండలు, కోనలు, నదులు, సముద్రం, జంతువులు, ఆఖరికి మనుషులు గూడా పదార్థాలే. ద్రవ్యమంటే పృథివ్యాది పదార్థాలు. 'పంచదార' అనగానే మన బుర్రలోకి పంచదార భావమే కలుగుతుంది కానీ ఉప్పో పప్పో లేక మరేదో భావం కలగదు. అలాగే పాలు, కొండలు, నదులూ వగైరా. ఇవన్నీ "ద్రవ్య" భావాలు. అయితే ఇలా భావాలు కలగించేవి పదార్థాలు మాత్రమే కావు. పంచదార అనగానే దానికున్న తీపి గుణం "తీపి" అనే భావాన్ని మనకి స్ఫురింపచేస్తుంది. రాముడు అనగానే అతని సచ్ఛీలత అనే గుణం మనకి "గుణ" భావం కలిగిస్తుంది. రావణుడు అనగానే అతను అలవాటుపడిన దుష్టకర్మల వలన దుష్ట "కర్మ" భావం స్ఫురిస్తుంది. "మనిషి" అనగానే మనిషన్నవాడు ఎలా ఉంటాడో తెలుసు కాబట్టి మనకి స్ఫురించే మనిషి ఆకారం "సామాన్య" భావం. "నృసింహ స్వామి, వినాయకుడు" అనగానే వారు పూర్తిగా మనిషి ఆకారం కాదు, పూర్తిగా సింహమో, ఏనుగో ఆకారాలు కావు కాబట్టి మనకి స్ఫురించే భావాలు విశేష భావాలు. ఎవరినో చూపిస్తూ "ఆయన నాకు దగ్గర బంధువే" అన్నామనుకోండి, అది "సమవాయ" భావం. సమవాయం అంటే వదుల్చుకోలేని సంబంధం - నిత్యసంబంధం. ఇలా ఆరు రకాలుగా భావోత్పత్తి కలుగుతుంది.

సాధారణంగా ఏదైనా ఒక పదార్థం గురించి భావించామనుకోండి. మనకి తెలవకుండానే ఆ పదార్థం గురించి, పైన చెప్పిన భావాలన్నీ కలగడానికి అవకాశం ఉంది. ఉదాహరణకి కేతకీ పుష్పం (మొగలి పువ్వు) తీసుకోండి. అదొక పువ్వు అనే వస్తుభావం ద్రవ్యభావం. దాని వాసన గుణ భావం. అమ్మవారికి ఇష్టమైనా శివార్చనకి పని చేయదన్నది కర్మ భావం. అది ఒక పువ్వుమాత్రమే అన్నది సామాన్య భావం. కాని అన్ని పువ్వులలా కాకుండా పొడుగ్గా ముళ్ళతో నిండి ఉంటుందన్నది విశేష భావం. మొగలి మొక్కజాతికి చెందినది అనే భావం సమవాయం.

పైన చెప్పిన ఆరు భావాలలోను ఏ భావంతో అమ్మవారిని ఊహించాలి? ఆమె "**అవ్యక్తా, నిరాకారా**"; ప్రత్యేకమైన ఆకారమేమీ లేనిది కావున ఒక ద్రవ్యభావం లేదు. ఆమె "**నిర్గుణా**"; గుణభావం లేదు. ఆమె "**కార్యకారణ నిర్ముక్తా**"; కర్మభావం లేదు (ఈ నామం గురించిన విశ్లేషణ మరో అధ్యాయంలో చేస్తాం). సామాన్యురాలు కాదు కావున సామాన్య భావం ఉండదు. ఒక్కొక్కరికి ఒక్కొక్కలా తోచే ఆమెను ఏ నిర్దిష్ట విశేష భావంతో గ్రహించగలం! ఆమె "**నిర్లేపా**" – దేనినీ, ఎవరినీ అంటిబెట్టుకుని ఉండేది కాదు; "**హేయోపాదేయ వర్జితా**" (హేయ= వదిలేయాలిసినది, ఉపాదేయ = గ్రహించాలిసినది); ఆమెకు ప్రత్యేకించి గ్రహించాలిసిన వారూ లేరు, వదిలేయాలిసిన వారూ లేరు, అందరూ సమానమే కావున సమవాయ భావం ప్రసక్తి లేదు. అందుకని ఆమె అన్నివిధాలా "భావ వివర్జితా".

మరైతే ఆమెను ఊహించేదెలా? గ్రహించేదెలా? భావించేదెలా? ఈ ప్రశ్నలకి సమాధానం వేదాన్త తత్త్వ శాస్త్రాలలోనే లభిస్తాయి.

గ్జినోఫనేస్ అనే ఓ గ్రీక్ తత్త్వశాస్త్రి (క్రీ. పూ. 570) చేసిన ఒక వాదం ఇలా ఉంది: "సింహాలకీ, గుర్రాలకీ బొమ్మలు గీయటం చేతనయ్యి అవి కూడా దేవుడి బొమ్మలను గీస్తే, దేవుడిని సింహం సింహంలాగానే, గుర్రం గుర్రంలాగానే గీస్తాయి. ఆఫ్రికన్లు దేవుడు నల్లగానే ఉంటాడనుకుంటారు. ఆ దేవుడన్నవాడు ఎలా ఉండడో తెలుసుకోగలమేమోగానీ ఎలా కచ్చితంగా





ఉంటాడో తెలుసుకోలేం" అని ఆయన వాదం. ఈ వాదానికి తగిన సమాధానం ఈ రోజుకీ ఎవ్వరూ ఇవ్వలేక పోయారు. గ్జినోఫనేస్ నిరీశ్వరవాది కాడు. (అనుబంధం చూడండి.)

"యం భావం దర్శయేద్యస్య తం భావం స తు పశ్యతి" (మాండూక్య కారిక 2-29) – పెద్దలచే ఏ భావం చూపించబడుతుందో ఆ భావమే దర్శించుకుంటారు. "యద్యద్రూపాది కల్పేత బుద్ధ్యా తత్తత్ ప్రకాశయన్, తస్య తస్య భవేత్సాక్షీ, స్వతో వాగ్బుద్ధి అగోచరః" (పంచదశి) – మన బుద్ధులు పరమాత్మను ఏ యే రూపాలుగా కల్పించుకుంటాయో ఆ ప్రకారంగానే వెలుగుతూ సాక్షీభూతమవుతున్నది తప్ప, అసలైతే పరమాత్మ మన మనోబుద్ధులకు అగోచరం. "యద్భావం తద్భవతి" – ఎలా భావిస్తే అలాగనే. "భావములోన భాగ్యము నీవు" అనీ, "ఎంత మాత్రము ఎవ్వరు తలచిన అంత మాత్రమె నీవు" అనీ ఒకరు పాడుకుంటే, "ఎవరని నిర్ణయించేదిరా", "చీమలో బ్రహ్మలో ప్రేమమీర" నీవున్నావని మరొకరు పాడుకున్నారు. "పరమాత్ముడు వెలిగే ముచ్చట తెలుసుకో" అంటే అది మనలాంటి వారికి సాధ్యమా? (ఈ పాటని "**వాగధీశ్వరీ**" అనే అమ్మవారి నామంగల రాగంలో పాడతారు). "త్వమర్క స్త్వమిందు స్త్వమగ్ని స్త్వమాప స్త్వమాకాశ భూ వాయవస్త్వం మహత్త్వం, త్వదన్యో న కశ్చిత్ ప్రపంచోస్తి, సర్వం త్వం, త్వాం ఆనంద సంవిత్స్వరూపాం భజేహం" – అని అమ్మ వెలిగే ముచ్చటని సూర్యచంద్రులుగా, పంచ భూతాల రూపంగా, ఆనంద సంవిత్స్వరూపాగా (బ్లిస్ ఫుల్ ట్రూ నాలెడ్జ్ గా) భావించి, అసలు ఆమె తప్ప ఈ విశ్వంలో మరేమీ లేనేలేదని శంకరులు అమ్మవారిని ఊహించారు. అమ్మవారు "**భావజ్ఞా, భావనాగమ్యా**" (భావనోపనిషత్ కుండలిని, శ్రీచక్ర పూజ, మరెన్నో విశేషాలను తెలుపుతూంది) – మనమెలా భావించుకుంటామో మన ఇష్టం, ఆ ప్రకారంగా గూడా ఆమెను తెలుసుకోవచ్చు, చేరవచ్చును.

దైవ భావమంతా మన భ్రమ తప్ప మరేమీ కాదన్నామనుకోండి. భ్రమ రెండు రకాలని శాస్త్రం: సంవాది భ్రమ, విసంవాది భ్రమ. సున్నాన్ని చూసి కోల్డ్‌క్రీం అనుకుని ముఖానికి రాసుకుంటే మండుతుంది; సున్నంనీళ్ళని పాలనుకుని త్రాగబోతే నాలుక మండుతుంది. సత్ఫలితం లేకపోగా హాని కలిగించే ఈ భ్రమలు విసంవాది భ్రమలు. శిలామూర్తిని (విగ్రహాన్ని) దర్శించుకుని అదే అమ్మవారనో అయ్యవారనో అనుకుని కాస్సేపు దైవధ్యానం చేస్తే సత్ఫలితమే కలుగుతుంది కానీ హాని జరగదు. ఇది సంవాది భ్రమ. (పంచదశిలో – ధ్యానదీప ప్రకరణంలో ఈ విషయ వివరణ బాగుంటుంది.)

పరమాత్మ మనకు ప్రత్యక్ష దర్శనం అయితే ఈ భ్రమ విభ్రమాల గోల లేకపోను గదా! నిజంగా పరమాత్మ అన్నవాడు ఉన్నాడో, లేడో? ఉంటేనేగదా ప్రత్యక్షం అయ్యేది. కొందరు లేనే లేడనీ, కొందరు ఉందో లేదో అనుమానమేనని వాదించారు. "కలడు కలండనువాడు కలడో లేడో" అని గజేంద్రుడికి అనుమానం రాలేదూ! (అనుమానం జైనుల "స్యాద్వాద" సాంప్రదాయం.) తప్పకుండా ఉన్నాడని మరికొందరి వాదన. ఇలా అన్నిరకాల వాదాలు వింటూంటాం.

"అస్తి నాస్తి అస్తినాస్తీతి నాస్తినాస్తీతి వా పునః, చలస్థిర ఉభయ అభావైః ఆవృణోత్యేవ బాలిశః" – అని మాండూక్య కారిక (4–83). చలనమున్న ఆత్మ ఉందనటం "చలం", లేదనటం "స్థిరం", ఉండవచ్చు–లేకపోవచ్చు అనటం "ఉభయం", లేదుకాక లేదు అనటం "అభావం". ఈ వాదాలతో మూర్ఖులు అసలు పరమేశ్వరుడిని కప్పేస్తున్నారు. (ఆత్మయొక్క చలాచలస్థితుల గురించి ఈశావాస్యోపనిషత్‌లో "తదేజతి, తన్నైజతి" అంటూ వివరించ బడింది. చలపతి అంటే **ఆత్మవిద్యా**, చలనమున్న ఆత్మకి పతి – ఆత్మేశ్వరుడు. "ఆత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం" అని వేదఘోష చేయించుకునే తిరుమల నారాయణ, చలపతి, చలాపతి (లక్ష్మీపతి), వేంకటాచలపతి కూడా.)





"అసన్నేవ స భవతి, అసద్ బ్రహ్మేతి వేద చేత్; అస్తి బ్రహ్మేతి చేద్ వేద సంతమేనం తతోవిదురితి" – తైత్తిరీయ ఆనన్దవల్లి (6). బ్రహమన్నది ఏదీ లేదు అని భావించినవాడు ఉండీ లేనివాడవుతున్నాడు. బ్రహ్మమున్నది అని భావించినవాడు జ్ఞానిగా తెలియబడుతున్నాడు. "నైవా వాచా న మనసా ప్రాప్తుం శక్యో న చక్షుసా, అస్తీతి బ్రువతః అన్యత్ర కథం తదుపలభ్యతే – కఠోపనిషత్ (6–12) – వాక్–మనస్–చక్షువులతో మాత్రమే తెలుసుకోబడలేని ఆ పరమాత్మ ఉందని చెప్పేవారి నుంచే గానీ, లేదనే వారినుంచి మనకేమి లభిస్తుంది!

అమ్మవారు "**అచిన్త్యరూపా**"–మన భావాలకికూడా అందనంతగా మరెన్నో విధాలుగా ఆ "**మనోవాచామగోచరా**" ఉండవచ్చు. "అచిన్త్యాః ఖలు యే భావాః న తాం స్తర్కేణ యోజయేత్, ప్రకృతిభ్యః పరం యచ్చ తద్ అచింత్యస్య లక్షణం" (పురాణోక్తి, పాఠాంతరంగా పంచదశి–6) – సామాన్య ప్రకృతికి అతీతమయి ఊహకందని ఆ అచిన్త్య భావాన్ని తర్కంతో తెలుసుకోవాలి అనుకోకూడదు. ఆ రూపాన్ని వాక్కులు మనస్సు కూడా చేరుకోలేక తిరిగిపోతున్నాయి – "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి" – ఆనంద వల్లి (9). "అచిన్త్యం చ అప్రమేయం చ వ్యక్తా~వ్యక్తం పరం చ యత్, సూక్ష్మాత్సూక్ష్మతరం జ్ఞేయం తన్మే మనశ్శివసంకల్ప మస్తు" – ఊహకందని, కొలువ వీలులేని, కనిపించి–కనిపించని అతిసూక్ష్మతరమైన ఆ పరబ్రహ్మాన్ని తెలుసుకోవాలనే నా సంకల్పం శుభమగుగాక! లలితాంబిక అసలు రూపం మనం తెలుసుకోలేకపోయినా ఆమె లేకపోలేదు, ఉంది అని మన నమ్మకం. అలా నమ్మటం ఎవరూ తీసేయలేని మన హక్కు. కానీ మనం భావించినట్లే ఆమె ఉండి తీరాల్సిన అవసరంలేదు. అందుకని ఆ భావాతీతా "భావవివర్జితా" అయింది.

ఉందనీ, లేదనీ చెప్పటానికి ప్రత్యక్ష ఋజువులేమీ లేకపోయినప్పటికీ, ఉందీ (ఉన్నాడూ) అని ఎవరైనా నమ్మదల్చుకుంటే అలా నమ్మటం వారి హక్కు; అది సముచితం – అని అమెరికన్ తత్త్వవేత్త విలియమ్ జేమ్స్

(క్రీ.శ. 1842–1910) వాదించాడు. అయితే ఉందనో లేదనో ఏదో ఒక విశ్వాసం మాత్రం ఉండి తీరాలని, తటస్థంగా ఉండగూడదని కూడా జేమ్స్ వాదించాడు. మతవిశ్వాస విషయాలలోనే గాక, మరెన్నో సందర్భాలలో గూడా ఈ వాదం సరైనదని చాలామంది గ్రహించారు.

ఇక ఏడవదైన అభావం గురించి తెలుసుకుందాం. అభావం అంటే లేకపోవటం.

(7) అభావం: "ప్రతియోగిజ్ఞానాధీనజ్ఞానోఽభావః"; "అభావస్తు ప్రాగభావ ప్రధ్వంసాభావ అన్యోన్యాభావ అత్యన్తాభావ లక్షణః చతుర్విధః" (స.ప). అభావం నాలుగు రకాలు: ప్రాగభావం, ప్రధ్వంసాభావం, అన్యోన్యాభావం, అత్యంతాభావం. వీటిలోని అత్యంతాభావాన్ని ఒక అభావంగా కొందరు ఒప్పుకోలేదు.

(7–ఎ) ప్రాగభావం: "వచ్చే సంవత్సరం ఇల్లు కట్టుకుందామనుకుంటున్నాను" అనో, "వచ్చే నెల నెక్లెస్ చేయించుకోవాలనుకుంటున్నాను" అనో లేక మరేదో ఇలాంటి తలంపులని చెప్పారనుకోండి. వచ్చే సంవత్సరపు ఇల్లు, వచ్చే నెలనాటి నెక్లెస్ ఇప్పుడు లేవు. కానీ భవిష్యత్తులో వచ్చే ఆ వస్తువుల భావం మాత్రం మన మనస్సులలో ఆల్రెడీ స్థిరపడ్డాయి. ఒక్కో సందర్భంలో అసలు భవిష్యత్తులో ఏమేమి సిద్ధిస్తాయో కూడా మనకి ఓ ఐడియాయే లేకపోవచ్చు. ఉదాహరణలు కావాలంటే, 100 ఏళ్ళ క్రితం డెస్క్‌టాప్ కంప్యూటర్లు, మొబైల్ ఫోన్లు, డిజిటల్ కెమేరాలు మొదలైనవాటి గురించిన భావాలే లేవు. కానీ ఈ రోజు ఇవన్నీ ఉన్నాయి. అంటే ఇవి గతంలో అభావాలై, తరువాతి రోజుల్లో నిజంగా ఉండి భావసిద్ధిని పొందాయి. భూత వర్తమాన కాలాలో లేకపోయి, భవిష్యత్తులో సిద్ధించ గలిగేవి ప్రాగభావాలు. "అనాదిః సాన్తః ప్రాగభావః" (స.ప).

(7–బి) ప్రధ్వంసాభావం: కృష్ణకాటుకలు, బంగారు తీగల వంటి బియ్యంతో అన్నం వండుకుందామంటే ఇప్పుడు వీలుపడదు. చిన్నప్పుడు నేను అ ఆ





ఇ ఈ లు వ్రాసుకున్న పలకా కణికిలు ఆరోజుల్లోనే ధ్వంసమైపోయినా భావరూపేణా నాకింకా గుర్తున్నాయి. అప్పుడు పాఠాలు చెప్పిన మాస్టర్లు ఈరోజు లేకపోయినా ఇంకా గుర్తున్నారు. గతంలో ఉండి ప్రస్తుతం లేక పోయినవి, భవిష్యత్తులో కూడా ఉండలేనివి ప్రధ్వంసాభావాలు. "అనిత్యత్వం ప్రధ్వంసవత్త్వం"; "వినాశః ప్రధ్వంసః" (స.ప).

(7–సి) అన్యోన్యాభావం: కాఫీ అడిగితే టీ ఇచ్చారు అనుకోండి. మరి కాఫీ ఎట్టి పరిస్థితులలోనూ టీ అవలేదుగదా! కాఫీని టీగా ఎప్పుడూ భావించలేము. ఒక పదార్థం ఒకే సమయంలో వివిధ పదార్థాలుగా ఉండలేక పోవటం అన్యోన్యాభావం. "తాదాత్మ్యనిషేధో అన్యోన్యాభావః" (స.ప).

(7–డి) అత్యంతాభావం: దాహం వేస్తోంది. ఎండమావులలో నీళ్ళు త్రాగి దాహం తీర్చుకోగలమా? గాలిలో ఎయిర్కండిషన్డ్ మేడలు కట్టుకుని ఉండగలమా? ఎండమావులలో నీళ్ళు ఉండవు; గాలిలో మేడలు కట్టలేము. ఇలాంటివి ఎంతగా ఊహించుకున్నా అవి అసంభవమైనవైనవి కాబట్టి అవి అత్యంతాభావాలు. "అనాదిరనన్తః సంసర్గాభావో అత్యన్తాభావః" (స.ప).

ప్రాగభావం, ప్రధ్వంసాభావం ఈ రెండూ కాలానికి సంబంధించిన విషయాలు. These are related to time dimension. అన్యోన్యాభావం ఏకకాలంలో సంభవాఽసంభవాలకు సంబంధిన విషయం. It is related to simultaneous existence. అత్యంతాభావం నిజస్థితికి సంబంధించిన విషయం. It is related to the reality itself. ఈ మూడు కోణాలనుంచి అమ్మవారి తత్త్వాన్ని అర్థం చేసుకోవాల్సి ఉంది.

అమ్మవారు ఉండటం అన్నది ప్రాగభావ–ప్రధ్వంసాభావమా? ఒకప్పుడు లేకపోయినా తరువాత వచ్చేది ప్రాగభావం, ఒకప్పుడు ఉన్నా తరువాత ధ్వంసం అయిపోయేది ప్రధ్వంసాభావం అని పైన తెలుసుకున్నాం. "**అనాది నిధనా**" – అంటే పుట్టటం, గిట్టటం అనే ఆద్యంతాలు లేక ఎల్లప్పుడూ ఉన్నది, ఉండేది. మరి, ప్రళయం వచ్చినప్పుడు ఇప్పుడున్న ప్రపంచమంతా

నాశనమైపోతుందని అనుకుంటాం గదా! అంటే ఈ సమస్త ప్రపంచం గూడా తరువాతి కాలంలో ప్రధ్వంసాభావానికి గురయ్యేదే కదా! నిత్యము, నైమిత్తికము, దైనందినము, కల్పాంతము, మహాప్రళయము అని 5 రకాల ప్రళయాలు చెప్పబడ్డాయి. మహాప్రళయములో అందరు, అంతా నశించిపోయినా తనకేమీ ఇబ్బంది లేక సాక్షిగా క్షేమంగా మిగిలి యుండే అమ్మవారు "**మహాప్రళయ సాక్షిణీ, ఏకాకినీ**". ఆమె తప్ప ఇంకెవ్వరూ మిగలనందున "**సాక్షి వర్జితా**" అయింది. ఈ విధంగా ప్రాగభావ–ప్రధ్వంసాభావాల ప్రసక్తి ఆమెయందు లేదు.

అమ్మవారు ఉండటం అన్నది అన్యోన్యాభావమా? ఆమె ఇప్పుడు లేక ఒకప్పుడు ఉండేదా? లేక భవిష్యత్తులోనే ఉంటుందా? దేశకృత పరిచ్ఛేదం, కాలకృత పరిచ్ఛేదం, వస్తుకృత పరిచ్ఛేదం అని మూడు రకాల పరిచ్ఛేదాలు చెప్పబడ్డాయి. పరిచ్ఛేదం అంటే విభజన.

(ఎ) దేశకృత పరిచ్ఛేదం: ఒక చోట ఉండగా, మరోచోట ఉండలేకపోవటం.
(బి) కాలకృత పరిచ్ఛేదం: ఒకప్పుడు ఉండగా మరొకప్పుడు ఉండలేకపోవటం (ప్రాగభావ, ప్రధ్వంసాభావాలు).
(సి) వస్తుకృత పరిచ్ఛేదం: ఒక పదార్థంలో ఉండి మరో పదార్థంలో లేకపోవటం.

అమ్మవారికి ఈ మూడు రకాల పరిచ్ఛేదాలు లేవు. ఆమె ఎల్లప్పుడూ, ఎల్లకాలాలోను, అంతటా ఉంటుంది. "**అపరిచ్ఛేద్యా, దేశకాల అపరిచ్ఛిన్నా**" అని అమ్మవారి నామాలు. ఈ విధంగా అన్యోన్యాభావ ప్రసక్తి ఆమెయందు లేదు.

అమ్మవారు ఉండటం అన్నది అత్యంతాభావమా? ఆమె ఎండ మావులలోని నీటివంటిదా, గాలిలో మేడ వంటిదా, అసలు ఉందా లేదా, అని అడుగుతోంది ఈ ప్రశ్న. తత్త్వపరంగా చాలా గహనమైన ఈ ప్రశ్న "**కార్యకారణ నిర్ముక్తా**" అన్న అధ్యాయంలో చర్చిద్దాం. ప్రస్తుతానికి ఇలా తెలుసుకుందాం: ఆమె "**భక్తిమత్ కల్పలతికా, సర్వార్థదాత్రీ, కామధుక్,**





**అన్నదా, వసుదా, సద్యః ప్రసాదినీ, క్షిప్ర ప్రసాదినీ, వాంఛితార్థ ప్రదాయినీ**" గా తెలియ బడుతూంది. భక్తులు అడిగినవన్నీ అన్నధనాలతో సహితంగా అడిగినవెంటనే కల్పవృక్షంలా, కామధేనువులా ప్రసాదిస్తూండగా ఆమె ఎండమావులలోని నీరు, గాలిలో మేడ ఎలా అవుతుంది? ఈ విధంగా అత్యన్తాభావ ప్రసక్తి కూడా ఆమెయందు లేదు.

పైన వివరించిన భావాభావాల గందరగోళాలతో తనకేమీ సంబంధం లేదు అంటోంది "**భావా~భావ వివర్జితా**" అమ్మ శ్రీమాత.

పాశ్చాత్య తత్త్వశాస్త్రకారులు గూడా ఈ భావాభావవిషయాల గురించి, పదార్థజ్ఞానం గురించి చాలా ఆలోచింపచేసే వాద–ప్రతివాదనలను చేసుకున్నారు. ఒకప్పుడు ఉండటం, మరొకప్పుడు లేకపోవటం, మార్పు జరుగుతూండటం అనే విషయాల గురించి పార్మనైడ్స్ (క్రీ.పూ. 500) అనే పాశ్చాత్య తత్త్వశాస్త్రి చేసిన వాదనలలో ప్రాగ్ – ప్రధ్వంస – అన్యోన్య – అత్యన్త అభావాల ధోరణి కనిపిస్తుంది. అతని ప్రకారం, ఉన్నదల్లా ఒకటే, అది ఎప్పుడూ మారదుగాక మారదు. ఏదైనా అసలు లేనేలేదని వాదించామంటే, "లేకపోవటమేమిటి? ఫలానా లేదు అన్నామంటే ఆ ఫలానా ఏమిటో మనకి తెలిస్తేనేగదా అది లేదు అని చెప్పగలం. అంటే కనీసం మన మస్తిష్కాలలోనైనా అది ఉన్నట్లే గదా! అందుచేత పదార్థం ఉందా లేదా అన్నది ముఖ్యం కాదు. ఇదివరకు ఉన్నది ఇప్పుడు లేకపోవచ్చు; తరువాత తరువాత వచ్చేది ఇప్పుడు లేకపోవచ్చు; కానీ భావం ఎప్పుడూ ఉంటోంది. అందుచేత పదార్థం కన్న భావమే ముఖ్యము. ఉన్నదల్లా భావమే; అభావం ప్రసక్తి లేదు" అంటాడు ఈయన. ఈ వాదంతో అందరూ ఒప్పుకోలేదు. అసలు ఏ పదార్థం గురించైనా ఒకానొక భావం కలగాలంటే, ఆ పదార్థంతో పరిచయముంటేనే గదా భావం ఏర్పరుచుగోగలం. ఫలానా వస్తువు పంచదార, ఫలానా వస్తువు ఉప్పు, అంటూ గ్రహించేది వాటితో పరిచయమయ్యాకనే గదా, అందుకని పదార్థమే ముందర ముఖ్యం, తరువాతనే పుట్టి ఏర్పడే భావం ముఖ్యం కాదు అని ప్రతివాదం చేశారు. పుట్టటం అంటూ ఉంటే గిట్టటమూ

ఉంటుంది కాబట్టి భావం శాశ్వతం కాదు అని మరో ప్రతివాదం.

ఈ వాదనలు కొంత గందరగోళానికి దారి తీశాయి. ఒకటి: పాలని చూడగానే, ఇవి పాలు అన్నామంటే, అవి ఏ సున్నం నీళ్ళో కాదని చెప్పినట్లే గదా (అన్యోన్య అభావం)! అయితే, ఇవి పాలు అని గన్నాట్ గా చెప్పటానికి, పాలలాగే కనిపించినప్పటికీ పాలు కాని వస్తువులన్నింటినీ గురించిన జ్ఞానం మనకి ఉండి తీరాలా? రెండు: భావం ఏర్పడినంత మాత్రాన ఆ పదార్థముండి తీరాలా? శూన్యం అంటే ఏమీ లేనిది. ఏమీ లేని శూన్యం గురించి గూడా మనకి ఓ భావం ఉంటోందే! మూడు: ఏదైనా వస్తువు అశాశ్వతమైనంత మాత్రాన ఆ వస్తువు అసలు లేనేలేదని చెప్పగలమా? వస్తువులు నిజంగా ఉన్నా అవి శాశ్వతంగా ఉండి తీరవలసిన అవసరం లేదే!

ఈ సందర్భంలో, ఆధునిక కాలంలో డె కార్టె (క్రీ.శ. 1596–1650) అనే ఫ్రెంచ్ తత్త్వశాస్త్రి ఆలోచనలు రెండు రకాల వాదాలకి దారితీశాయి. ఒకటి: భావవాదం (ఐడియలిజం), రెండు: భౌతిక వాదం (మెటీరియలిజం). ఇతని ప్రకారం భావించే మనస్సు ఉంది. భావించబడవలసిన భౌతిక పదార్థమూ ఉంది. పదార్థమూ (శరీరం కూడా పదార్థమే), మనస్సూ రెండూ వేరు. ఈ రెండూ కాని దేవుడు కూడా ఉన్నాడు. స్పినోజా (క్రీ.శ. 1632–1677) అనే స్పానిష్–డచ్ తత్త్వవేత్త ఉన్నదల్లా దేవుడొక్కడే; మనస్సూ, పదార్థాలూ దేవుడి లక్షణాలు మాత్రమే అని వాదించాడు. ఇతని వాదాలు రామానుజ విశిష్టాద్వైత "చిత్–అచిత్–ఈశ్వర" తత్త్వత్రయ వాదానికి, బృహదారణ్యకోపనిషత్‌లోని యాజ్ఞవల్క్య ఉపదేశానికి దగ్గరలో ఉన్నట్లు తోస్తుంది. లైబ్నిజ్ (క్రీ.శ. 1646–1714) అనే జర్మన్ శాస్త్రవేత్త ప్రకారం మనస్సూ మాటర్ (పదార్థం) రెండూ కూడా స్వతహాగా శక్తిమంతమైనవి. అనేకరకాలుగా ఉండే శక్తియే మనస్సు, పదార్థాలుగా వ్యక్తం చేసుకుంటూ విశ్వరూపంగా దర్శనమవుతోంది అని ప్రతిపాదించాడు. ఈ వాదం విన్నప్పుడు అమ్మవారి "**చిత్ శక్తిః చేతనారూపా, జడశక్తిః జడాత్మికా**" అనే నామాలు గుర్తుకు





వస్తాయి. జాన్ లాక్ (క్రీ.శ. 1632–1704) అనే బ్రిటిష్ తత్త్వవేత్త మనస్సు (మైండ్), భావాలు (పెర్సెప్షన్స్), బాహ్యప్రపంచము (మేటర్) – ఈ మూడూ నిజంగా ఉన్నాయి అని వాదించాడు. ఇతని వాదనలు, పైన వివరించిన వైశేషిక భావసిద్ధాన్త ధోరణిని ప్రశ్నించేలా ఉంటాయి. పదార్థాలగురించి మనకుందనుకున్న జ్ఞానం మన భావాలేగానీ నిజంగా పదార్థజ్ఞానం కాదని, యదార్థజ్ఞానానికి బాహ్యాన్తర ఇన్ద్రియాల ద్వారా కలిగే అనుభూతి, ఋజువులు, అన్తఃప్రబోధం, మూడూ ముఖ్యం అన్నాడు. బిషప్ బర్క్లీ ((క్రీ.శ. 1685–1753) అనే ఐర్లండ్ తత్త్వవేత్త ప్రకారం మనం తెలుసుకోలేని భౌతిక పదార్థం లేదు; అనుభవంతో మన మనస్సులు తెలుసుకోగలిగినంత మాత్రమే ఈ ప్రపంచం ఉండి, దానిగురించిన భావాలు ఏర్పడుతున్నాయి. మనస్సు తెలుసుకోలేని భౌతికప్రపంచం లేదు; లేనిదాని గురించి భావం ఏర్పడదు. ఉందని వాదిస్తే అది కల్పన మాత్రమే (స్వర్గం, నరకం వగైరా). దేవుడు ఉన్నాడని అంగీకరించినా భావ–అనుభవాలలోకి రానిదంతా నిరాకరించే ఒక రకమైన మాయా సిద్ధాన్తం ఇది. డేవిడ్ హ్యూమ్ (క్రీ.శ. 1711–1776) అనే స్కాటిష్ తత్త్వవేత్త ప్రకారం భావాలు మాత్రమే ఉన్నాయి; (అనుభవంలోకి వచ్చే పదార్థం కానటువంటి) మనస్సు, బయటి ప్రపంచమూ రెండూ లేవు; దేవుడూ లేడు. జర్మన్ తత్త్వవేత్త ఇమాన్యుయల్ కాంట్ (క్రీ.శ. 1724–1804) ప్రకారం బాహ్యప్రపంచం కనిపించే తీరూ, విధానం మన మనస్సు మీద ఆధారపడి ఉంటుంది. అంటే ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా ఉన్నట్లు ఈ ప్రపంచం దర్శనమిస్తుంది. అసలు స్వరూప మేమిటో ఎవరికీ తెలవదు.

అయితే ఎవరినో, దేన్నో తలుచుకుని అదే అమ్మవారని మనం భావిస్తున్నామా? మీరు ఊహించుకుంటున్న అమ్మవారు, నేను ఊహించుకుంటున్న అమ్మవారు ఒకటేనా? ఒక పదార్థానికీ మరో పదార్థానికీ తేడా (భేదం) నిర్దుష్టంగా గ్రహించగలిగితే ఆయా పదార్థాల గురించిన భావాలు విస్పష్టంగా ఏర్పడతాయి. భేదాలు 3 రకాలు: సజాతీయ, విజాతీయ, స్వగత భేదాలు.

(ఎ) స్వజాతీయ భేదం: ఒక చెట్టుకీ మరో చెట్టుకీ ఉన్న భేదం; రెండూ చెట్లులే. అలాగే గంగా గోదావరిల భేదం; రెండూ నదులే. మేరు హిమవత్ పర్వతాల భేదం, రెండూ పర్వతాలే; ఇలా వగైరా వగైరా.
(బి) విజాతీయ భేదం: రాళ్ళు నీళ్ళ మధ్య భేదం. అలాగే నదులు పర్వతాల మధ్య భేదం. మనుష్యులు పశువుల మధ్య భేదం, వగైరా.
(సి) స్వగత భేదం: ఒకే చెట్టులో కొమ్మలు వేరు, ఆకులు వేరు, పువ్వులు వేరు, పళ్ళు వేరు. అలాగే, ఒకే శరీరంలో కళ్ళు, చెవులు, ముక్కు, నోరు వగైరాలు వేరు వేరు.

అమ్మవారు "**నిర్భేదా, భేదనాశినీ**". ఆమెకు సజాతీయ విజాతీయ స్వగత భేదాలు లేవు కాబట్టి భేదరూపేణా ఆమెను గుర్తుపట్టటం అసాధ్యం.

చిరకాల భారతీయ తత్త్వవేత్తలు భేదాలగురించి వాదోపవాదాలు చేసుకున్నారు. "ద్రవ్య గుణధర్మభేదాత్ చ ఉపలబ్ధి నియమః" అని న్యాయశాస్త్రం; అంటే ఏ ద్రవ్యనిర్ధారణైనా ఆ ద్రవ్యంయొక్క ప్రత్యేక గుణధర్మాల పై ఆధారబడి ఉంటుంది. ఒక వస్తువు మరేదో వస్తువు కాదు అని "వస్తుధర్మభేదం" ద్వారా మాత్రమే చెప్పగలమని కొందరి వాదన. అంటే పాలు, సున్నంనీళ్ళ ధర్మాలలోని తేడాల బట్టి ఇది అది కాదు అని చెప్పగలం అంటారు. "వస్తుధర్మభేదం" కన్న "వస్తుస్వరూపభేదం" ముఖ్యమంటారు మరికొందరు; అంటే రూపంలోని భేదాన్ని బట్టి చెప్పగలం. అయితే పాలూ, నీళ్ళూ కలసిపోయి ఉంటే స్వరూపభేదముండదు, అప్పుడు ఏది ఏదో ఎలా చెప్పగలరు అంటే సమాధానం: ఏదైనా నిశ్చిత భావాన్ని గ్రహించాలంటే అవరోధాలుండకూడదు; కానీ సామాన్యంగా ఎనిమిది రకాల (అతిదూర, అతిసామీప్య, ఇన్ద్రియఘాత, మనోనవస్థా, సౌక్ష్మ్య, వ్యవధాన, అస్తంగత, సమానాభిహారాలు – సాంఖ్య కారికా 1-7) అవరోధాలేర్పడి అసలు వస్తువుని గ్రహించలేకపోవచ్చు. పాలూ నీళ్ళూ కలసిపోయినప్పుడు ఇవి పాలు, ఇవి నీళ్ళూ అని చెప్పలేకపోవటానికి కారణం సమానాభిహారమనే అవరోధం. అవిద్య రెండు విధాలు: తూల-అవిద్య, మూల-అవిద్య.





స్వరూపాలు ఒకేలా ఉన్నప్పుడు ఏ వస్తువేదో తెలుసుకోలేకపోవటం తూల-అవిద్య; ఇది భ్రాంతిని కలిగిస్తుంది. జీవ-బ్రహ్మల అభేదాన్ని తెలుసుకోలేకపోవటం మూల-అవిద్య; ఇది ముక్తికి అవరోధం కలిగిస్తుంది. "**విద్యాఽవిద్యా స్వరూపిణీ**" అని అమ్మవారి నామం. మన ప్రస్తుత విషయానికి సంబంధించి ఈ చర్చ సారాంశమేమంటే, రూపభేదమైనా ధర్మభేదమైనా ఏయే విధాలుగా మనం శ్రీమాతను భావించినా, అన్ని విధాలగానూ ఉన్నది అమ్మే. కానీ రకరకాల అవరోధాలుండి ఆమె అసలు తత్త్వాన్ని మనం గ్రహించలేకపోతున్నాం.

ఒక నిశ్చిత రూపమేలేని శ్రీమాతను ఎందుకు ఏదో ఒక రూపంగా భావిస్తూ సేవిస్తున్నాము? నిర్గుణోపాసన, నిరాకారోపాసన చాలా కష్టతరమైనవి. అందుకని "సాధకస్య తు రక్షార్థం తస్య రూపమిదం స్మృతం" – సాధకుడిని రక్షించటంకోసమే ఏదో ఒక రూపం అతని స్మృతిలో ఉంచ బడుతూంది. "న వస్త్వనాకారం ఉపైతి బుద్ధిః" – ఆకారం లేనిదాన్ని బుద్ధి సరిగ్గా గ్రహించలేదు. అందుకని ఏదో ఓ రూపంగా ఆమెను భావిస్తే ఏకాగ్రత కుదురుతుంది. ఈ విధానాన్ని "ప్రతీకోపాసన" అంటారు. అయితే అలా ఉపాసకులు కల్పించుకున్న వ్యక్తిగత భావన చెల్లుతుందా?

ఈ ప్రశ్న భగవద్గీతలో కూడా వస్తుంది. పరమాత్మని ఏ విధంగా, అంటే ఏదో స్వరూపాన్ని భావించుకుంటూ సగుణాకారంగా సేవించాలా? "**వ్యక్తాఽవ్యక్త స్వరూపిణీ, వివిధాకారా, ప్రకటాకృతిః**" అని అమ్మవారి నామాలు. లేక నిర్దిష్టమైన ఏ స్వరూపం లేని అవ్యక్తమైన నిర్గుణిగా ఉపాసించాలా? "**అవ్యక్తా, నిర్గుణా, నిరాకారా, నిష్కలా**" అని అమ్మవారి నామాలు. "ఏవం సతతయుక్తా యే భక్తాః త్వాం పర్యుపాసతే, యే చాపి అక్షరం అవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః" – సగుణోపాసకులు, నిర్గుణోపాసకులలో ఎవరు యోగవిత్తములు? భక్తి గూడా ఒక యోగం కాబట్టి ఈ ప్రశ్న ఇలా అడగబడింది.

"క్లేశోధికతరః తేషాం అవ్యక్తాసక్త చేతసాం, అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిః అవాప్యతే" – దేహధారులకు నిర్గుణోపాసన చాల కష్టమైనది. "సత్యం జ్ఞానం అనన్తం బ్రహ్మ". సత్యము జ్ఞానమయము అనన్తము అయిన ఆ బ్రహ్మాన్ని, బ్రహ్మానందరూపాన్ని వాక్కులు మనస్సు కూడా చేరుకోలేక తిరిగిపోతున్నాయి అని "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ ..." – తైత్తిరీయ ఆనంద వల్లి (1, 9) తెలుపుతోంది. "**సత్యజ్ఞానానందరూపా, మనోవాచామగోచరా**" అని అమ్మవారి నామాలు. "**బ్రహ్మరూపా, తత్ పదలక్ష్యార్థా**" – మనం చేరుకోలేకపోతున్న ఆ పరబ్రహ్మరూపం అమ్మవారు.

సగుణోపాసనైనా, నిర్గుణోపాసనైనా, భక్తులు నాకే మనస్సప్పగించి, నన్నే దృష్టిలో ఉంచుకుని, అంతటా, అన్నివేళలా, అన్నింటినీ సమదృష్టితో చూస్తూ తమ తమ కార్యకలాపాలనన్నింటిని సాగిస్తూ కర్మ ఫలితాలను నాకే వదిలేసినంతవరకూ, రెండూ రకాల ఉపాసనా సమానమే. అన్నివేళలా అన్ని సందర్భాలలోనూ నాకే మనస్సంతా అప్పగించేయటం కుదరదు అనుకుంటావేమో, అభ్యాసం (రిపీటెడ్ ప్రాక్టీస్) చేస్తే అదే అలవాటవుతుంది. అభ్యాసమే కుదరకపోతే నువ్వు చేసే పనులన్నీ నీకోసం గాక, నాకోసమే చెయ్యి, అప్పుడు నిన్నెలా ఉద్ధరించాలో నేను చూసుకుంటాను – "అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరం, అభ్యాసయోగేన తతో మాం ఇచ్ఛాప్తుం ధనంజయ, అభ్యాసేపి అసమర్థోసి మత్కర్మపరమో భవ, మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిం అవాప్స్యసి" అని కృష్ణ పరమాత్మ తెలియచేశాడు. "**అభ్యాసాతిశయజ్ఞాతా**" – అతిశయమైన అభ్యాసంతో మాత్రమే తెలుసుకోబడగల్గిన అమ్మవారి నామమిది.

భావ వివర్జితా, అభావ వివర్జితా అన్న నామాల్లోని ముఖ్యమైన తేడా: ఆమె ఫలానా విధంగా ఉంటుంది (భావం) అని మనకి తోచినా ఆమె అసలలా (ఉండనక్కర) లేకపోవటం భావ వివర్జితా. తను లేసే లేనట్లుగా (అభావం) మనకి తోచినప్పటికీ ఆమె నిజంగా ఉండటం అభావ వివర్జితా.





లేకపోయినప్పటికీ ఉన్నట్లు తోచటమేమిటి, ఉన్నప్పటికీ లేనట్లు తోచటమేమిటి? కొన్ని ఉదాహరణలతో అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చేద్దాం. భూమిమీద నిజానికి అక్షాంశాలు, రేఖాంశాలు లేవు. అవి నిజంగా ఉన్నట్లుగానే ఊహిస్తూ ఆ నిలువు–అడ్డ రేఖలని మనమే గ్లోబ్ మీద గీసుకుని లాభపడుతున్నాం. అలాగే, అంతరిక్షంలో తూర్పు, పడమర వగైరాలు లేవు. నిజంగా అవి ఉన్నాయని భావిస్తూ లాభపడుతున్నాం. అసలు ఈ జగత్తే ఒక మాయ అనీ, ఒక మిథ్య అనీ, నిజంగా ఉందనుకోవటం మన భ్రమ, మానసిక కల్పన అని వేదాన్తులు వాదిస్తూంటారు. కానీ ఈ జగత్తంతా ఉందనుకుంటేనే (ఉందనుకునే సంవాది భ్రమతోనే) మన మనుగడ సాగుతోంది. ఈవిధంగా ఆమె "**మిథ్యా జగదధిష్ఠానా**" – మన మనుగడ కోసమే మిథ్యా జగత్‌ని కల్పించిన అధిష్ఠాన దేవత. కానీ తను మాత్రం ఈ మిథ్యా జగత్‌కి అతీతమయి, మనం ఊహించినరీతిలోనే తను ఉండవలసిన అవసరం లేక "భావ వివర్జితా" అయింది.

ఇక ఉండిగూడా లేనట్లుగా తోచే ఉదాహరణలను చూద్దాం. దేహమే ఆత్మ, ఆత్మ అన్నది వేరే ఏమీ లేదని కొంతమంది వాదిస్తారు. " చైతన్య విశిష్టః దేహ ఏవ ఆత్మా" – చైతన్యమున్న దేహమే ఆత్మ అని కొంతమంది మహర్షులు గూడా చేసిన ఈ వాదం "దేహాత్మ వాదం" అనీ, "భూతచైతన్య వాదం" అనీ పేర్కొనబడింది. ఇలా అనుకోవటం విసంవాది భ్రమ అనీ; దేహం వేరూ, ఆత్మ వేరూ, ఆ రెండూ ఒకటి కాదు; మనం ప్రత్యక్షంగా చూడలేకపోయినా దేహాతీతమైన ఆత్మ అనేది వేరుగా ఉంది అని వాదించేవారు చాలామంది ఉన్నారు. ఆత్మలాగే పరమాత్మ కూడా లేద(డ)ని కొందరు, ఉందని కొందరు వాదిస్తారు. ఉన్నప్పటికీ లేనట్లుగా తోపించగలిగే సందర్భాలు ఇవి. తను లేనట్లుగా తోపిస్తూ (అభావం), నిజానికి ఉంది (భావం). భావానికి అభావం భావా~భావం – ఉన్నదానిని లేదనటం; అది వివర్జితా – వర్జింపబడినది. అంటే ఉందన్నమాట. లేదనటానికి వీల్లేదు. ఈ విధంగా "అభావ వివర్జితా" అయింది. ఉన్న అమ్మను లేదనుకున్నవారు "అసన్నేవ స భవతి, అసద్ బ్రహ్మేతి వేద చేత్"

– ఉండీ ఏమీ లేనివారు అవుతున్నారు అని శ్రుతి వాక్యం పైన చెప్పింది గదా!

ఆ విధంగా "**భావా~భావ వివర్జితా**" అయిన ఆ "**సదసద్రూప ధారిణీ**" శ్రీ లలితాంబికకు నమస్కారం.

ఓం శ్రీ కల్పనారహితాయై నమః, ఓం శ్రీ నామరూపవివర్జితాయై నమః,

ఓం శ్రీ పరమాణవే నమః,

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ లలితాంబికాయై నమః ।

---

అనుబంధం

ప్రేమ వ్యవహారంలో దెబ్బతింటే వేదాన్తి అయిపోయే ప్రమాద ముంటుందని కాబోలు, "అంతా మట్టేనని తెలుసు, అదీ ఒక మాయేనని తెలుసు" అని ఒక భగ్నప్రేమికుడిచేత పాడించాడు ఓ మహాకవి. గ్జెనోఫనేస్ సరిగ్గా అదే అన్నాడు. ఈ విశ్వమంతా మట్టిలో పుట్టి, మట్టిలోనే కలిసిపోతుంది అని వాదించాడు.





అధ్యాయము 08

# 8. శ్రీ కార్యకారణనిర్ముక్తా, సృష్టికర్త్రీ, శ్రీ లలితాంబికా

శ్రీ లలితా సహస్రనామాలన్నింటిలోనూ బహుక్లిష్టతరమైన నామం **కార్యకారణనిర్ముక్తా**. ఈ నామం గురించి మూడు విధాలుగా తెలుసుకోవాలి.

(1) అమ్మవారు ఏ కారణంగా సిద్ధించింది?
(2) జగత్సృష్టి అనే కార్యానికి కారణమెవరు?
సృష్టికార్యముతోనూ, కారణాలతోనూ అమ్మవారికుండే సంబంధం ఏమిటి?
(3) కార్యానికి కారణానికి మధ్యనుండే సంబంధం ఏమిటి? (సంబంధం ఉండవలసిన అవసరం లేదు).

కార్య–కారణాలతో అమ్మవారి సంబంధం సంగతి పేరు; కార్యానికీ కారణానికీ మధ్యనుండే సంబంధం సంగతి పేరు.

ఈ మూడు విధాలుగానూ అర్థావగాహన పొందితేగానీ, వీటిలో ఏ కార్య–కారణాల గురించి ఈ నామం చెప్తుందో తెలవదు. ఒక్కొక్కటి ఆలోచిద్దాం.

కార్యం అంటే పని; కారణం అంటే హేతువు. అయితే కార్యం అంటే పని అనేగాక, దాని ఫలితమని గూడా గ్రహిస్తూ, కార్య–కారణ సంబంధం అంటే హేతువు – పని – ఫలితం, వీటి మధ్యనుండే సంబంధమని వ్యాఖ్యానాలు చేయబడ్డాయి. ఈ సంబంధాన్నే "కాజ్ అండ్ ఎఫెక్ట్ రిలేషన్", "కాజాలిటీ", "కాజేషన్" అనీ ఆంగ్లం లో అంటారు. శాస్త్రజ్ఞులు "కారణాలు" ని "ఉపాదాన కారణం" (మెటిరియల్ కాజ్), "నిమిత్త కారణం" (ఎఫిషెన్ట్ కాజ్) అని రెండు రకాలుగా విశ్లేషించారు. ఉదాహరణ: మనం కాఫీ చేసుకునేప్పుడు వాడే పాలు, పంచదార, కాఫీపొడి వగైరాలు ఉపాదాన

కారణం; కాఫీ చేసుకోవాలనిపించి చేసుకున్న మనం నిమిత్త కారణం అవుతున్నాము. (వైశేషిక) శాస్త్రజ్ఞులు సమవాయి, అసమవాయి అని మరికొన్ని కారణాలను కూడా పేర్కొన్నారు. ఉపాదాన కారణాన్ని ముఖ్యకారణంగా గ్రహించకూడదని కొంతమంది వాదించారు. "కార్యకారణ నిర్ముక్తా" అనే నామం లో నిమిత్తకారణం, ఉపాదానకారణం, రెండింటి గురించి చెప్పబడింది.

(1) అమ్మవారు ఏ కారణంగా సిద్ధించింది? "దేవీ హ్యేకా అగ్ర ఆసీత్" – మొట్టమొదట ఉన్నది ఒక అమ్మవారేనని బహ్వృచోపనిషత్. **"బ్రహ్మరూపా", "బ్రహ్మ"** స్వరూపిణి అయిన అమ్మవారి ఉనికికి ఏవిధమైన కారణం లేదు. "న తస్య కార్యం కారణం చ విద్యతే, న తత్సమశ్చ అభ్యధికశ్చ దృశ్యతే, పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే ... " (శ్వేతాశ్వతర 6–8) – ఆ పరబ్రహ్మానికి (ఉండటానికీ, చేయటానికీ) కార్యకారణాలన్నవి ఏమీ లేవు; తత్సమానమైన వారు, అంతకన్న అధికులైనవారూ కనిపించట్లేదు; దానికున్న శక్తి రకరకాలు. అమ్మ **"నిరీశ్వరా"** (ఇదో నామం) – ఆమెపైన మరెవరూ లేరు. అనగా, ఆమె మరెవరి కారణంగానో సిద్ధించిన కార్యం కాదు. "న చాస్య కశ్చిత్ జనితా" – (శ్వేతాశ్వతర 6–9), **"అయోనిః"** – ఎవరివలనో పుట్టింపబడినది కాదు. అందుకని ఆమె **"కార్యకారణనిర్ముక్తా"**.

(2) జగత్సృష్టి అనే కార్యానికి కారణమెవరు? **"సృష్టికర్త్రీ, యోని నిలయా"** అని అమ్మవారి నామాలు. జగత్ సృష్టి రహస్యం దాగున్న రెండవ ప్రశ్న చాలా గహనమైన విషయం. వేదాన్తదర్శనాలవరకు మనం వెళ్ళగలిగితే కొంత అవగాహన పొందవచ్చు. భారత దార్శనిక చరిత్రలో ఆరు వేదాన్తదర్శనాలు ప్రసిద్ధి పొందాయి. అవి: సాంఖ్య, యోగ, న్యాయ, వైశేషిక, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంసలు. ఇవిగాక జైన, బౌద్ధ, చార్వాక అనే నాస్తిక దర్శనాలు కూడా ఉన్నాయి. ఆది శంకరుల అద్వైతం, రామానుజుల విశిష్టాద్వైతం, మధ్వాచార్యుల ద్వైతం, నింబార్క–శ్రీకంఠ–వల్లభ–విజ్ఞానభిక్షు–బలదేవులు, మరెంత మందో





నవన్యాయవైశేషికులు (ఉద్యోత, జయన్త, వాగీశ, గంగేశాదులు) చేసిన "దర్శనాలు" ఉన్నాయి. ఒక రకంగా చార్వాకం కూడా దర్శనమే.

ఈ దర్శనాల దృక్పథాలు చాల ఆసక్తికరమైనవి. ఒక దర్శనం ప్రకారం, దేవుడు లేడు, దెయ్యమూ లేదు, స్వర్గం లేదు, నరకం లేదు, బ్రహ్మం లేదు, ఆత్మ లేదు; ఉన్నదంతా మనము, మన ప్రపంచం మాత్రమే. బ్రతికున్నంతవరకు అప్పుచేసైనా పప్పుకూడు తిని ఎంజాయ్ చెయ్యాలి (ఋణం కృత్వా ఘృతం పిబేత్) అని ఈ దర్శనం వాదించింది. ఈ దృక్పథానికి ఇతర దర్శనాలు పూర్తిగా వ్యతిరేకమైనవి. ఈ పుట్టటం, బ్రతికి బట్టతల తెచ్చుకుని చావటం, ఈ నాటకం, ఇదంతా ఎందుకు! అసలు పుట్టటం – సంసారబురదలో పేగటం – గిట్టటం వీటినుంచి తప్పించుకునేదెలా అని ఈ దర్శనాలు వాపోయాయి. **"జన్మ మృత్యు జరా తప్త జన విశ్రాన్తిదాయినీ"** అనీ, **"సంసారపంకనిర్మగ్న సముద్ధరణ పండితా"** అనీ అమ్మవారి నామాలు. పుట్టటం, ముసలితనం వచ్చేవరకూ సంసారం బురదలో ఇరుక్కుపోయి చావటం, మళ్ళీ పుట్టటం, మళ్ళీ చావటం, మళ్ళీ, మళ్ళీ ఇదే గోల. ఈ చక్రభ్రమణం తప్పించుకోలేక తపించుకుపోతున్న జనాలను ఉద్ధరిస్తూ కాస్త విశ్రాన్తినిచ్చే మహాతల్లిట అమ్మవారు.

ఈ విశ్వం, ప్రపంచం, ఉన్న మూలంగానే కదా పుట్టటం–పేగటం–గిట్టటం జరుగుతున్నాయి! అసలు ఈ జగత్ సృష్టి అనే కార్యం ఎవరు ఏ కారణంతో చేశారు? ఈ ప్రశ్నకి సమాధానం విశ్లేషించటంతో పైన చెప్పిన దర్శనాలన్నీ రకరకాలుగా సతమతమైనాయి.

"అన్యేషాం కారణం బ్రహ్మప్రతిభాసోత్థితం జగత్, అజస్య కారణం బ్రహ్మ తేన అసౌ ఏకదేహవాన్ । బ్రహ్మా సంకల్పపురుషః పృథ్వ్యాదిరహితాకృతిః, కేవలం చిత్తమాత్రాత్మా కారణం త్రిజగత్ స్థితేః । బ్రహ్మణా తన్యతే విశ్వం మనసైవ స్వయం భువా, మనోమయమతో విశ్వం యన్నామ పరిదృశ్యతే ।" (లఘుయోగవాశిష్టం). పరబ్రహ్మం స్వయంసంకల్పం, స్వయంభువం; అంటే

తన ఉనికికి తనే కారణం. పృథివి మొదలైన రూపాలకి అతీతమయిన ఆ కేవల చిత్తమాత్రాత్మ మూడు జగత్తుల స్థితికి కారణం. కనిపించే ఈ విశ్వమంతా తన మనస్సుతోనే వ్యాపిస్తూ ఆ పరబ్రహ్మ మనోమయుమయి ఉంటోంది. ఆ పరబ్రహ్మ ప్రతిభా ప్రతిభాసయే ఈ జగత్తంతటికీ కారణం. ఇది వశిష్టులవారు శ్రీ రామచంద్రునిచే చేయించిన విశ్వదర్శనం.

కొందరు ఈ విశ్వమంతా ఒకప్పుడు లేదు, దీన్ని ఎవరో మహానుభావులు పనిపెట్టుకుని తయారుచేశారు ("అసత్" నుంచి "సత్" ని చేసిన సృష్టికార్యం) అని వాదించారు. మరికొందరు, ఎవరూ సృష్టించకుండానే విశ్వమంతా తనంతట తనే ఉద్భవించింది అని వాదించారు (ఇది స్వయంభువ కార్యం). మొదట్లోనే మరోలా ఉన్నదాంట్లోనుంచే ఈ విశ్వమంతా ఇప్పటికి ఇలా పరిణమించింది అని మరో వాదన. ఉన్నదంతా మొదట్లో ఉన్నదే, ఇప్పుడు ఉన్నట్లుగా కనిపించేదంతా అసలు లేనేలేదు – అని మరో వాదన (అద్వైతం). అసలు మొదట్లోను లేదూ; ఇప్పుడూ లేదు అని మరో వాదన. లేకపోవటమేంటి; మొదట్లోనూ ఉంది, ఇప్పుడూ ఉంది అని మరో వాదన. ఈ రకరకాల వాదనలను "సత్కార్య–అసత్కార్య వాదనలు" అంటారు. ఇదివరకు లేక ఇప్పుడు కొత్తగా రావటం "అసత్కార్య వాదం"; దీన్నే "ఆరంభవాదం", "ఉత్పత్తి వాదం" అని కూడా అంటారు; ఇది న్యాయ, వైశేషిక దర్శనాల దృక్పథం. వీటినిబట్టి కొన్ని దర్శనాలు ఆస్తికమని, కొన్ని నాస్తికమని, కొన్ని సేశ్వరమని, కొన్ని నిరీశ్వరమని విభజించబడ్డాయి.

మొదట్లోనూ ఉంది, ఇప్పుడూ ఉంది; మొదట్లో ఉన్న దాంట్లోంచే ఇప్పుడున్నది వచ్చింది ("సత్–కార్య వాదం", "ఆవిర్భావ వాదం") అని వాదించిన దర్శనాలలో సాంఖ్యం ఒకటి. దీని ప్రకారం విశ్వమంతా మొదటినుంచీ ఉన్న "ప్రధాన"మనబడే ప్రకృతి నుంచి తయారయింది. అదే **"మూలప్రకృతి"** అనబడే అమ్మవారి నామం.





"సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః, ప్రకృతేర్మహాన్, మహతోహంకారో, అహంకారాత్ పంచ తన్మాత్రాణి, ఉభయమిన్ద్రియం, తన్మాత్రేభ్యః స్థూలభూతాని, పురుష ఇతి పంచవింశతిర్గుణః" – అని కపిల సాంఖ్య దర్శన సూత్రం (1–61). "ప్రకృతేర్మహాన్స్తతోహంకారః తస్మాద్ గణశ్చ షోడశకః, తస్మాదపి షోడశకాత్ పంచభ్యః పంచభూతాని" – అని సాంఖ్య కారికా (22).

మూలప్రకృతిలో సత్త్వ–రజస్–తమోగుణాలు సమానస్థితిలో ఉంటాయి. ఆ ప్రకృతి వలన మహత్ తత్త్వం (బుద్ధి), మహత్ నుంచి అహంకారం, అహంకారం నుంచి మనస్సు (అంతరిన్ద్రియం, ఉభయేన్ద్రియం), జ్ఞానేన్ద్రియ–కర్మేన్ద్రియాలు (బాహ్యేన్ద్రియాలు), ఈ ఇన్ద్రియాల వలన శబ్ద–స్పర్శ–రూప–రస–గన్ధాలనే పంచ తన్మాత్రలు (**"పంచతన్మాత్రసాయికా"** అని నామం.), వాటివలన పృథివి–అప్–తేజస్–వాయు–ఆకాశాలనే స్థూలభూతాలు (**"పంచభూతేశీ"** అని నామం.) క్రమంగా కలుగుతున్నాయి. ఇవి అన్నీ కలసి మహదాది 24 తత్త్వాలు. పురుషుడు, అంటే పరమపురుషుడు, తో కలసి మొత్తం (ప్రకృతి + మహత్ + అహంకారం + మనస్సు + 5 జ్ఞానేన్ద్రియాలు + 5 కర్మేన్ద్రియాలు + 5 తన్మాత్రలు + 5 మహాభూతాలు + పురుషుడు) 25 తత్త్వాలు. **"తత్త్వమయీ"** అని అమ్మవారి నామం. ఇంత సృష్టికీ కావలసిన శక్తి మొదట్లోనే కలిగి ఉన్న ఆ తల్లి, **"ఆదిశక్తి"**. **"మహతీ"** – మహత్తరమైన పరిమాణం కలిగినది అని మరో నామం. మూలప్రకృతి ఉపాదాన కారణమవగా, అందునుంచి పుట్టిన మహదాదులు (మహత్ మొదలైనవి) కార్యాలయ్యాయి. పురుషుడు (25వ తత్త్వం) నిమిత్త కారణం.

"ప్రకృతేః సుకుమారతరం న కించిదస్తీతి మే మతిర్భవతి" – ఆ మూలప్రకృతియంత సుకుమారమైనది మరోటి లేదు – (సాంఖ్య కారికా – 61). **"స్వభావమధురా"** అని అమ్మవారి నామం. "మూలప్రకృతిరవికృతిః, మహదాద్యాః ప్రకృతివికృతయః, సప్త షోడశకస్తు వికారః, న ప్రకృతిః న వికృతిః పురుషః" – (సాంఖ్య కారికా – 3). అమ్మ మరోదేనికీ వికృతి కాని

**"ఆదిశక్తి"**. కానీ తనకి వికృతి ఉంది; అది మహత్. ఆ మహత్‌కి వికృతి అహంకారం. అహంకారానికి వికృతి మనస్సు; మనస్సుకి వికృతి ఇన్ద్రియాలు; వాటికి వికృతి తన్మాత్రలు; వాటికి వికృతి మహాభూతాలు. పురుషుడు మాత్రం ప్రకృతీ కాదు, వికృతీ కాదు. " ..... ఉభయోరపి సంయోగః తత్కృతః సర్గః " – (సాంఖ్య కారికా – 21); ప్రకృతి, పురుషుల సంయోగం వలన ఈ జగత్తంతా ఉద్భవించింది. పురుషుడు ప్రకృతిచేత ఆకర్షింపబడుతూ, అదంతా తను అనుభవించటానికే ఉంది అని భ్రమపడుతూ, ఆ ప్రకృతినే ఉపాదానంగా వినియోగించుకుంటూ మహదాది కార్యాలకు లోనవగా జగత్ ఉద్భవించింది. ప్రతిప్రాణీ ఆ "పురుషుడి" అంశలే. ఈ విషయాలను తెలుపుతూ **"పురుషార్థప్రదా, సృష్టికర్త్రీ, ఆబ్రహ్మకీట జననీ, విశ్వమాతా"** అని నామాలు.

సాధారణంగా హేతువు లేకుండా ఏ పనీ చేయం. కానీ ఇదీ హేతువు అని మనం చూపించే (లేక చెప్పుకునే) కారాణాలతోగానీ, మనం చేసే పనులతోగానీ, మనతోగానీ అమ్మవారికి ఎంతవరకు సంబంధం? ఆమె మూలప్రకృతిగా ముడిపదార్థమైన జడం. ఒక ఉదాహరణతో ఆలోచిద్దాం. పాలు ఉన్నాయి. కొంచెం ఉత్సాహం కలగటానికి ఆ పాలతో కాఫీ చేసుకున్నాం. లేక, ఇష్టం కదా అని పాయసం చేసుకున్నాం. లేక, పెన్న, నెయ్యి వగైరాలు చేసుకున్నామనుకోండి. పాలకీ, ఆయా పదార్థాలు చేసుకోవాలనిపించిన మన హేతువులకీ సంబంధం లేదు. పాలు కాఫీనవదల్చుకోలేదు, క్షీరాన్నమే అవుతాను, లేక పెన్నగానే మారతాను అని తమంతటట చెప్పట్లేదు. పదార్థాలు చేసుకోవటానికి పాలు ప్రకృతి పరంగా వచ్చిన ఒక మూలపదార్థంగా మాత్రమే కావలసి వచ్చాయి. ఆ మూల(ముడి)పదార్థంతో ఏమిటి ఎందుకు చేస్తామో కారణాలున్నది మనకేగానీ ముడిపదార్థానికి (పాలకి) కాదు. ఈ సందర్భంలో, ఆయాయా పదార్థాలు తయారవటానికి మనం నిమిత్త కారణం. పాలు ఉన్నాయి కాబట్టే కాఫీ వగైరాలు చేసుకోవాలనే నిమిత్తం మనకి కలిగింది అని అనుకుంటే, పాలు ఒక ఉపాదాన కారణమవుతున్నది తప్ప, పాలకంటూ స్వతహాగా నిమిత్త కారణమేమీ లేదు. అమ్మ పాలవంటి





మూల–ముడిపదార్థమైన ప్రకృతిగా ఉపాదానకారణం. కోరికలు, హేతువులు (కారణాలు), కర్మలు, కార్యాలు ఉన్నది ప్రాణి కోటికేగానీ, అమ్మవారికి లేవు. ఆమె **"నిష్కామా"** – ఏ విధమైన కోరికలు లేనిది. **"నైష్కర్మ్య"** – విధిగా ఆమె చేయవలసిన కర్మలు ఏ విధమైనవీ లేనిది. ఆమెకు నిమిత్తమన్నది లేదు కావున ఆమె **"కార్యకారణనిర్ముక్తా"** అయింది.

అయితే ఆ ప్రకృతి గతంలో ఉన్నట్లుగానే ఉందా, లేక మార్పు (పరిణామం–ట్రాన్స్ఫర్మేషన్) చెందుతూందా? మార్పు చెందటం అసంభవం అని వాదించినవారు ఉన్నారు. ఎప్పటికప్పుడు, అనుక్షణం, మార్పు చెందుతూనే ఉంటుంది అని వాదించిన వారూ ఉన్నారు (పరిణామ వాదం). మారిపోతూంటే ఎలాంటి మార్పులు జరుగుతున్నాయి? మార్పులు ప్రకృతికుండే స్వభావాన్నిబట్టి జరుగుతూంటాయి అని సాంఖ్యదర్శనం. కొన్ని మార్పులు ఆహ్లాదకరమైనవి, కొన్ని హానికరమైనవి, కొన్ని తటస్థమైనవి. ఆహ్లాదకరమైనవి సత్త్వ స్వభావమని, హానికరమైనవి రజో స్వభావమని, తటస్థమైనవి తమస్ స్వభావమని గుర్తింపు పొందాయి. ఈ మూడింటినే సత్త్వ–రజస్–తమో గుణాలు అని మనం వ్యవహరిస్తున్నాం – **"గుణనిధీ"** అని అమ్మవారి ఒక నామం. అయితే, మార్పు చెందాలి అనే స్వభావం ఒక బలమైన మహత్ ఇఛ్ఛ; ఇఛ్ఛతోపాటు అహంకారం ఉంటుంది. అహంకారం ఒక మానసిక స్థితి; మనస్సుకి, తను అనుకున్న మార్పులు పొందటానికి సాధనాలు కావాలి. పంచ తన్మాత్రలను సూక్ష్మరూపాలుగా గలిగిన పంచస్థూలభూతాలని అనుభవంలోకి తెచ్చే కర్మేన్ద్రియ–జ్ఞానేన్ద్రియాలు మనస్సుకి సాధనాలు.

అమ్మ మూలప్రకృతిగా అవ్యక్తం – **"అవ్యక్తా"** అని ఒక నామం. ఆమెనుంచే త్రిగుణాలతో (**"త్రిగుణాత్మికా"**) సహితంగా 24 మహదాది తత్త్వాలు ఉద్భవించి వ్యక్తమైనాయి. ఆమె మాత్రం ఈ గుణాలన్నింటికీ అతీతురాలు – **"గుణాతీతా"**. ఈ మొత్తమంతా కలిపితే ఆమె **"వ్యక్తా~వ్యక్త స్వరూపిణీ"**. "పురుషార్థ హేతుకమిదం నిమిత్త నైమిత్తిక ప్రసంగేన,

ప్రకృతేర్ విభుత్వ యోగాత్ నటవద్ వ్యవతిష్ఠతే లింగం" (సాంఖ్య కారికా – 42) – మహాపురుషుడు హేతువుగా, ప్రతిప్రాణీ ఏవేవో నిమిత్త–నైమిత్తిక కారణాలతో రకరకాల శరీరాలతో నటుడిలా మూలప్రకృతి అండదండలలో (సుఖదుఃఖాలనుభవిస్తూ) వ్యవహరిస్తూంటూంది. కష్టమైనా, నష్టమైనా, అనుభవించేది ప్రాణులే. ఈ నాటకాలలో అమ్మ ఏ కారణం లేకుండానే ఉన్న మూలప్రకృతి (అవికృతి)గా ఉపాదానం మాత్రమే. నిమిత్త–నైమిత్తికాలనే అవసరాలు ఆమెకేమీ లేవు. అందుకని **"కార్యకారణ నిర్ముక్తా"**.

**"ధర్మిణీ"**: ధర్ + మ = ధర్మ. "మ" అంటే మహత్, అనగా బుద్ధికి సంకేతం. ధర్మమంటే బుద్ధిని ధరించటం. పైన చెప్పిన మహదాదులను ధరించేది (ధరింపచేసేదీ) **"ధర్మిణీ"**. "ధర్మేణ గమనం ఊర్ధ్వం, గమనమధస్తాత్ భవత్యధర్మేణ, జ్ఞానేన చ అపవర్గో విపర్యయాదిష్యతే బంధః" – సాంఖ్య కారికా–44. ధర్మం ఊర్ధ్వగతులకి, అధర్మం అధోగతులకి చేరుస్తాయి. బుద్ధిని సరైన విధంగా వినియోగించుకొమ్మని చెప్తూంది ఈ కారికా. ప్రకృతి – పురుషుల గురించిన జ్ఞానం ముక్తినిస్తుంది. అజ్ఞానం భవబంధాలను కల్పిస్తుంది.

స్వతహాగా అమ్మవారికి మార్పులూ, గుణాలూ ఉండవు అని సహస్రనామం చెప్తూంది. ఆమె, **"నిష్కామా", "నిష్కారణా" "నిరహంకారా", "నిష్క్రియా", "నైష్కర్మ్య"** – (పైన ఉదహరించిన పాలలాగ) స్వతహాగా ఏ కోరికలు లేనిది కాబట్టి, ఆమెకి అహంకారమూ లేదు, ఏ కారణమూ లేదు, ఏ కర్మలు–కార్యాలు లేవు. అందువలన ఆమె **"నిర్గుణా", "నిస్త్రైగుణ్యా"**: సత్త్వ–రజస్–తమో గుణాలతో ప్రత్యక్ష సంబంధం లేనిది. ఆమె **"నిర్లేపా", "నిత్యముక్తా"** – ఏవిధమైన ఎటాచ్మెంట్స్ లేని సర్వవిధ **"స్వతన్త్రా"**. అందుకని **"కార్యకారణనిర్ముక్తా"**. ఆమె ఎప్పటికీ, ప్రళయకాలంలో కూడా, మార్పు చెందనిది – అందుకని ఆమె **"కూటస్థా"**.





ఈ పై వివరణ సత్కార్యవాద సాంఖ్యదర్శనానుసారం చాలా క్లుప్తంగా ఇవ్వటమైనది. చాలా చాలా వివరాల జోలికి పోలేదు. ఈ వివరణలో ఓ గమ్మత్తు ఉంది. సేశ్వరమైన లలితా సహస్రంలో అమ్మవారికి **"నిరీశ్వరా"** అని నామముంది – అంటే ఆమెయే అందరికి ఈశ్వరి; ఆమెకు పైన ఈశ్వరుడెవరూ లేరు. కానీ దర్శనాలలో "నిరీశ్వర" అన్న పదం మరో భావంలో వాడతారు. ఈశ్వరుడు ఉన్నాడు (లేక ఈశ్వరి ఉన్నది) అని అంగీకరించినవి సేశ్వర దర్శనాలు. అంగీకరించనివి నిరీశ్వర దర్శనాలు. సాంఖ్యదర్శనం ఆస్తిక దర్శనమైనా నిరీశ్వర దర్శనం (సేశ్వర సాంఖ్యం యోగ దర్శనం). అంటే వేదప్రామాణ్యాన్ని అంగీకరిస్తుంది గానీ, ఈశ్వరుడున్నాడు అని ఒప్పుకోదు. అటువంటి నిరీశ్వర దర్శనాన్ననుసరించి పరమేశ్వరి నామాలను అర్థం చేసుకోవటం ఒక విచిత్రం!

జగత్ సృష్టి కార్య–కారణ విషయంలో సాంఖ్యంతో అన్ని దర్శనాలూ అంగీకరంచలేదు. సృష్టికి కారణం ప్రధానమనబడే జడపదార్థ మూలప్రకృతి (తో పురుష సంయోగం) అంటే అందరూ ఒప్పుకోలేదు. **"జడశక్తిః జడాత్మికా"** అనేగాక **"చిత్శక్తిశ్చేతనారూపా"** అనికూడా కీర్తించబడుతున్న అమ్మవారు మూలప్రకృతిగా ఉపాదానకారణమే అవటమేమిటి; ఆ **"బ్రహ్మరూపా"** అమ్మవారికి నిమిత్తం లేకపోవటమేమిటి; ఉంది. "సో~కామయత బహు స్యాం ప్రజాయేయేతి; స తపో~తప్యత; స తపస్తప్త్వా ఇదగ్ం సర్వం అసృజత; యదిదం కించ తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్". పరమాత్మకు తను బహురూపాలుగా అవ్వాలని అనిపించి (**"బహురూపా", "భూమరూపా"** అని నామాలు; భూమరూపా అనే నామానికున్న విస్తృతార్థం మరో అధ్యాయంలో చర్చిద్దాం), ఆ కారణంగా తపస్సు చేసి, ఈ సృష్టిని కల్పించి, ఆ సృష్టిలో తను ప్రవేశించాడని తైత్తిరీయ ఆనన్దవల్లి (6). "తదనుప్రవిశ్య సత్ చ త్యత్ చ అభవత్, ...." అలా ప్రవేశించి సత్, త్యత్, అనేక నిరుక్త – అనిరుక్త రూపాలుగానూ అయ్యాడుట. సత్ అంటే మూర్తా, అంటే రూపం కలిగిన పృథ్వీ, నీరు, అగ్ని. త్యత్ అంటే అమూర్తా, అంటే

రూపంలేని వాయురాకాశాలు (బృహదారణ్యక–2–3 లో మూర్తా~మూర్త వివరణ ఉంది). **"మూర్తా~మూర్తా"** అని అమ్మవారి నామం. "సదేవ సోమ్యేదం అగ్రాసీత్, తత్ తేజో అసృజత" – మొదట ఉన్న సత్పదార్థమే తేజస్సు మొదలయిన ఈ విశ్వమంతా సృష్టించింది – అని కూడా శ్రుతి వాక్యం. ఇక్కడ సత్ అంటే పరబ్రహ్మమే గానీ ప్రధానమని చెప్పబడిన మూలప్రకృతి కాదు. ఈ విధంగా అమ్మవారు సృష్టికి నిమిత్తకారణం కూడా అవుతోంది. **"జగతీకందా"** (జగత్‌కి మూలమైనది), **"సృష్టికర్త్రీ"** అనిగదా అమ్మవారి నామాలు! అంటే కర్తృత్వం వహించినట్లే గదా! కర్తృత్వం రెండు రకాలు: సాధన సాధ్య కర్తృత్వం (తనే ప్రత్యక్షంగా పని చేయటం), సాన్నిధ్య సాధ్య కర్తృత్వం (పని తను చేయకుండా తన సన్నిధిలో ఉన్న పరులచే చేయించటం). ఆకాశం వలన వాయుసృష్టి కలగగా, వాయువువలన అగ్ని, అగ్నివలన నీరు, నీటివలన పృథివీ, పృథివి వలన ఓషధులు (చెట్టు చేమ వగైరా), ఓషధుల వలన అన్నం, అన్నం వలన ప్రాణులు పుట్టాయి ("ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నేరాపః, అద్భ్యః పృథివీ, పృథివ్యా ఓషధయః, ఓషధీభ్యః అన్నం, అన్నాత్ పురుషః") అంటే పరబ్రహ్మ స్వరూపిణి అమ్మవారి కర్తృత్వం సాన్నిధ్య సాధ్య కర్తృత్వం అని తెలుస్తూంది. పని చేయించిన అమ్మవారు హేతుకర్త్రి, పని చేసినవారు ప్రయోజ్య కర్తలు.

ఇక్కడ ఒక చిన్న సమస్య ఉంది. మూలప్రకృతికి పైన ఓ పరబ్రహ్మ ఉన్నాడు (ఉంది) అనీ, ఆ పరబ్రహ్మమే ఉపాదానమూ నిమిత్తమూ కూడా అని కొంతమంది, ముఖ్యంగా బ్రహ్మసూత్రవాదులు, వాదించారు. అంటే పరబ్రహ్మ తన నిమిత్తమై తననే ఉపాదానంగా ఉపయోగించుకుంటున్నాడు.

ఈ వాదన మళ్ళీ రెండు ప్రశ్నలకి తావు ఇస్తోంది.
ఒకటి: ఎవరైనా తనని తనే ఎలా ఉపయోగించుకుంటారు? సమాధానం: సాలె పురుగు తనని తనే ఎలా ఉపయోగించుకుంటూ గూడు కట్టుకుంటోందో, అలాగే.





రెండు: ప్రకృతి, అంతాకాకపోయినా కొంతైనా వ్యక్తమయి కనిపిస్తోంది. అసలు కనిపించనే కనిపించని పరబ్రహ్మ (**"అదృశ్యా"**, **"దృశ్యరహితా"** అని అమ్మవారి నామాలు) ఉందని ఎలా చెప్పగలం? సమాధానం: "అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేత్ వేద సన్తమేనం తతో విదురితి" – లేదని అనుకున్నవాడు (జ్ఞానం) లేనివాడవుతున్నాడు, ఉంది అనుకున్నవాడు (జ్ఞానం) ఉన్నవాడవుతున్నాడు – అని తైత్తిరీయ ఉపనిషత్, ఆనంద వల్లి (6). "బ్రహ్మవిత్ ఆప్నోతి పరం, తదేషాభ్యుక్తా, సత్యం జ్ఞానం అనన్తం బ్రహ్మ" – సత్యము జ్ఞానమయము అనన్తము అయిన ఆ బ్రహ్మాన్ని తెలుసుకున్నవారు పరాగతి పొందుతున్నారు – ఆనంద వల్లి (1). ఆ బ్రహ్మానందరూపాన్ని వాక్కులు మనస్సు కూడా చేరుకోలేక తిరిగిపోతున్నాయి అని "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి" – ఆనంద వల్లి (9) తెలుపుతోంది. **"సత్యజ్ఞానానందరూపా, మనోవాచామగోచరా"** అని అమ్మవారి నామాలు. **"తత్ పదలక్ష్యార్థా"** – ఆ బ్రహ్మపదమే అమ్మవారు. (ఈ విషయాలతో సంబంధమున్న అమ్మవారి మరో నామం **"స్వాత్మానంద లవీభూత బ్రహ్మాద్యానంద సంతతిః"** గురించి మరో అధ్యాయంలో చెప్పుకుందాం.)

ఇక్కడ సృష్టికి కారణం అమ్మవారే అని తెలుస్తోంది. ఈ చర్చ వలన **"కార్యకారణనిర్ముక్తా"** అనే నామంలో చెప్పబడిన కారణం సృష్టికారణం గురించికాదని తెలుస్తూంది.

(3) కార్యానికి కారణానికి మధ్యనుండే సంబంధం ఏమిటి? సంబంధం ఉందా, లేదా? ఉంటే, దానితో అమ్మవారికి సంగం ఉందా, లేదా, అనే విషయం ఆలోచిద్దాం. ఈ రకమైన కార్యకారణ సంబంధం గురించి పాశ్చాత్య తత్త్వజ్ఞులు కూడా చాలా విశ్లేషించారు. డేవిడ్ హ్యూం (క్రీ.శ. 1711–76) వారిలో ముఖ్యుడు. మన ఈ చర్చలో భారతీయ దర్శనాలకు మాత్రమే పరిమితమవుదాం. అదికూడా క్లుప్తంగా మాత్రమే. కొన్ని పేజీలలోనే కూలంకష చర్చ చేయటం వీలుపడదు.

బౌద్ధులు (హేతువాదులు) ఈ సంబంధాన్ని వివరిస్తూ, ప్రపంచంలో జరిగే ప్రతీ ఘటన వెనుక ఏదో ఒక కారణం ఉండి తీరుతుంది అని వాదించారు. ఉదాహరణకి, ఆకాశ కారణంగా వాయువు కార్యం, వాయుకారణంగా అగ్నికార్యం, అగ్నికారణంగా నీరు కార్యం, నీటికారణంగా పృథ్వి కార్యం .... . అంటే ప్రతీ కార్యం ఏదో ఒక కారణానికి ఫలం. ఇలా సిద్ధించిన ప్రతీ కార్యం తిరిగి మరో కార్యానికి కారణమవుతుంది. ఆ మరో కార్యం తిరిగి మరో కారణంఅవుతుంది; దానికి మళ్ళీ మరో కార్యం, అది మరో కారణం, ... ఇది అనంతం! జగత్తులో ఉన్న ప్రతీ విషయమూ (వస్తువు) మరోదానికి కార్యం; మరేదోదానికి కారణమూను. అదలా ఉన్న మూలంగా ఇది ఇలా జరిగింది; ఇది ఇలా అయిన మూలంగా మరేదో జరిగితీరుతుంది. బౌద్ధులు వేద శ్రుతులను ప్రమాణంగా అంగీకరించకపోయినా, ఈ కార్యకారణాల ప్రోసెస్లో శాశ్వతంగా ఉండేది మాత్రం ఏమీ లేదని. ప్రతీదీ మారిపోతూనే ఉంటుందని వాదించారు. ఇది బౌద్ధుల క్షణిక వాదం. అమ్మ "**శాశ్వతీ**" – అశాశ్వతమైన కార్యకారణాలతో సంబంధం లేని "**కార్యకారణనిర్ముక్తా**."

జైనులు, న్యాయ–వైశేషికులు, మరేమో చెప్పారు (ఆ వివరణల జోలికి ప్రస్తుతం వెళ్ళట్లేదు). మన సందర్భాన్ననుసరించి గౌడపాదులు ఏమన్నారో కొంచెమైనా తప్పకుండా తెలుసుకోవాలి. ఆది శంకరుల గురువు గోవిందులు; వారికి గురువులు గౌడపాదులు. ఆయన మాండూక్య ఉపనిషత్కి విస్తారమైన వ్యాఖ్యానం (మాండూక్య కారికా) వ్రాస్తూ, అందులో జైన, బౌద్ధ, సాంఖ్య దర్శనాల అభిప్రాయాలను విమర్శించారు. కార్యకారణ సంబంధాన్ని గురించి గౌడపాదుల కొన్ని అభిప్రాయాలను తెలుసుకుందాం.

"నాస్తి అసద్ధేతుకం అసత్, సత్ అసద్ధేతుకం తథా, సత్ సద్ధేతుకం నాస్తి, సద్ధేతుకం అసత్కుతః" – (మాండూక్య కారికా 4–40). అసత్ కార్యానికి అసత్ హేతువు కాలేదు; అనగా ప్రస్తుతం లేనిదానికి గతంలో లేని మరొకటి కారణం కాలేదు. ప్రస్తుతం ఉన్నదానికి గతంలో లేనిది (సత్కి అసత్) కారణమవలేదు; గతంలో ఉన్నది కూడా (సత్కి సత్)





కారణమవదు. ప్రస్తుతం లేనిదానికి గతంలో ఉన్నది కారణమయ్యే (అసత్కి సత్) ప్రసక్తి ఎక్కడ? "యావత్ హేతుఫలావేశః తావత్ హేతుఫలోద్భవః, క్షీణే హేతుఫలావేశే నాస్తి హేతు ఫలోద్భవః". "యావత్ హేతుఫలావేశః తావత్ సంసారస్ తావదాయతః, క్షీణే హేతుఫలావేశే సంసారం న ప్రపద్యతే" – (మాండూక్య కారికా 4–55, 56). కార్య–కారణాలేవో ఉన్నాయి, అవి తెలుసుకోవాలి అనే ఆవేశం ఉన్నంతవరకూ ఏవేవో కార్య–కారణ సంబంధాలుగా ఊహించబడుతూనే ఉంటాయి; ఈ ప్రాపంచిక సంసారం ఇలా సాగుతూనే ఉంటుంది. ఆ ఆవేశం నశించినప్పుడు కార్య–కారణాలుగా ఏమీ కనిపించవు; ఈ సంసారంలో చిక్కుకోం కూడా. "ధర్మా య ఇతి జాయన్తే జాయన్తే తే న తత్త్వతః, జన్మ మాయోపమ తేషాం సా చ మాయా న విద్యతే" – (మాండూక్య కారికా 4–58). తత్త్వపరంగా, ఈ జీవకోటులు, ఆత్మలు, సమస్త వస్తుసామగ్రి, ఇవేమీ పుట్టట్లేదు; అవి నిజానికి లేవు. ఉన్నట్లుగా అనిపించటం ఒక మాయ మాత్రమే. మాయ సత్ కాదు. ఉన్నదంతా ఒక పరబ్రహ్మమే; కార్యం లేదు, కారణం లేదు, కార్య–కారణాలు లేవు. ఏదో కారణంగా సృష్టించబడి ఇప్పుడు ఉన్నట్లుగా కనిపించే ఈ విశ్వకార్యమంతా మాయ తప్ప మరేమీ గాదు అని సారాంశం. ఇది అద్వైత దర్శనానికి అంకురం. "**అనాది నిధనా**" – అనాది (మొదట్లో లేక తరువాత వచ్చిన) మాయ; అమ్మవారు దాన్ని తొలగిస్తుంది. ఈ వాదనపరంగా కూడా అమ్మ "**కార్యకారణనిర్ముక్తా**".

ఈ విషయమయి మరికొంత వివరణ అవసరమవుతూంది. ఇప్పుడు ఉన్నది, గతంలో లేనిదాని కారణంగా ఎలాగా రాలేదు (సత్ అసద్ధేతుకం తథా). ఇప్పుడు లేనిది ఎలాగా లేదుకాబట్టి, గతంలో ఉన్నదాని కారణంగా వచ్చిందా (సద్ధేతుకం అసత్కుతః), లేనిదాని కారణంగా వచ్చిందా (నాస్తి అసద్ధేతుకం అసత్), అని అడగనే అక్కరలేదు. కానీ ఇప్పుడు ఉన్నది, గతంలో ఉన్నదాని కారణంగా కూడా రాదు (సత్ సద్ధేతుకం నాస్తి) అనటంలోని ఆన్తర్యమేమిటి? ఒక ఉదాహరణతో ఆలోచిద్దాం. ఒక బండశిలను చెక్కగా చెక్కగా ఒక సుందరి శిల్పం తయారయింది. బండశిల

ఇప్పుడు సుందరిగా పరిణమించింది అన్నామంటే అద్వైతులు ఒప్పుకోరు. ఇప్పుడున్న "సుందరి" కూడా బండశిలయే, కానీ అది "సుందరి" అనే మీరు భ్రమపడి అలా పిలుస్తున్నారు అని వాదిస్తారు. బండశిల సుందరిగా మారింది అనే పరిణామవాదాన్ని అద్వైతులు ఒప్పుకోరు. కానీ బండశిల సుందరిగా వివర్తమయింది అనే వివర్తవాదాన్ని ఒప్పుకుంటారు. అంటే ఇప్పుడు మరోలా ఉన్నట్లుగా కనిపిస్తున్నా ఇప్పుడూ, ఒకప్పుడూ, ఎప్పుడూ ఉన్నది మాత్రం బండశిలయే; ఇప్పుడు కొత్తగా ఉన్నట్లుగా కనిపిస్తున్న సుందరి నిజంగా లేదు; అలా మనకి తోచటం ఒక మాయ. రకరకాలుగా ఉన్నట్లు కనిపించే ఈ విశ్వం కూడా అంతే. నిజంగా లేదు; ఉన్నదంతా ఎల్లప్పుడు ఉండే ఆ పరబ్రహ్మం మాత్రమే. ఒక సినిమాలో ఒక నటుడు పది పాత్రలలో కనిపించినా ఆ వేషాలన్నింటి వెనుకా ఉన్నది ఒకే నటుడు – అన్నట్లుగా, అసలంటూ ఉన్నది పరబ్రహ్మమే, మనకి కనిపిస్తున్నదంతా వేషమే. ఈ చర్చ సారాంశం: మొదట్లో ఉన్న సత్, తరువాత మరో సత్‌ని సృష్టించటం గానీ, మరో సత్‌గా పరిణామం చెందటం గానీ (సద్హేతుకం సత్కార్యం) అసంభవం. కానీ మొదట్లో ఉన్న సత్, అసత్‌గా వివర్తం చెందటం (మాయవేషాలు వేయటం) సంభవం. ఆ అసత్‌ని (లేని ఈ జగత్తంతా) సత్ (నిజంగా ఉంది) అనుకోవటం మన అజ్ఞానం. అందుకని, "బ్రహ్మ సత్యం, జగన్మిథ్యా, జీవో బ్రహ్మైవ నాపరః, అనేన వేద్యం సచ్ఛాస్త్రం" (ఆదిశంకరులు).

ఆరంభం, పరిణామం అని రెండు విధాలుగా విశ్వసృష్టి (పదార్థోత్పత్తి) సంభవం అని శాస్త్రజ్ఞులు మొదట్లో వాదించారు. అయితే లేనిదానినుంచి కొత్తగా ఓ పదార్థం పుట్టింది అంటే నమ్మలేము గదా. అందుకని ఆరంభవాదాన్ని (అసత్ నుంచి సత్) తేలికగానే తరువాత కొట్టిపారేశారు. ఇక మిగిలిన పరిణామవాదం (ఉన్నది మార్పు చెందటం) లోని చిక్కేంటి అంటే, ఏదైనా వస్తువు పరిణామం చెందినప్పుడు మొదట్లో ఉన్నది మార్పు చెందిన తరువాత ఇక ఉండదు. పెరుగుగా మారిన తరువాత అలా మారనిక్రితం ఉన్న పాలు ఇక ఉండవు. [పరబ్రహ్మాన్ని ఒప్పుకుంటే (నిరీశ్వరం గాక సేశ్వరం అయితే)] పరిణామవాదం ప్రకారం,





మార్పుచెందాక ఇక ఆ పరబ్రహ్మం లేదని చెప్పవలసి వస్తుంది. అది పరమేశ్వరుని ఉనికికే ఇబ్బంది కలిగిస్తోందని ఈ వాదాన్నిగూడా ఒప్పుకోవటం కష్టమయింది. వివర్తవాద ప్రకారం ఉన్న వస్తువే సందర్భానుసారం పరిపరివిధాలుగా కనిపిస్తుంది తప్ప అసలు వస్తువు లేకుండా పోదు. కాబట్టి వివర్త వాదం పరబ్రహ్మ ఉనికికి ఇబ్బంది కలిగించకుండానే పదార్థోత్పత్తికి మూడో విధానమయింది. వివర్తం అంటే చుట్టుతిరిగి రావటం. ఒకే పరబ్రహ్మం ఇంకోలా కనిపిస్తోందని వివర్తవాదాన్ననుసరించి వాదించవచ్చు. ఇది అద్వైత దృక్పథం.

పరిణామవాదం, వివర్తవాదం, ఈ రెండూ సత్కార్యవాద అంతర్భాగాలు. అద్వైతులు వివర్తవాదాన్ని మాత్రమే ఒప్పుకున్నారు. వివర్తవాదం కార్య-కారణాల గురించిన మరో ముఖ్యమైన విషయానికి దారి తీసింది. కార్యం ఎప్పుడూ కారణంలో నిక్షిప్తమయి ఉంటుంది. ఉదాహరణకి, విత్తనంలో చెట్టు దాగుంది; నూనెగింజలలో నూనె దాగుంది. మామిడిటెంక నుంచి మర్రిచెట్టు రాదు; వేరుశనగలనుంచి నువ్వుల నూనె రాదు. చెక్కగా వచ్చిన సుందరి మొదటి బండశిలలోనే దాగుంది. శిలను చెక్కగా వచ్చిన "సుందరి" శిలాసుందరే గానీ సువర్ణసుందరీ కాదు, సజీవసుందరీ కాదు. అంటే, ఏ కార్యమైనా, దానికి సంబంధించిన కారణ-అంశలని కలిగే ఉంటుంది. కారణం తత్సంబంధిత కార్యాలయందు వ్యాపించి తీరుతుంది. దీన్ని "కార్య-కారణ అనన్యతా", లేక, "సర్వవ్యాపకత్వ వ్యవహారం" అంటారు. ఆ విధంగా చూస్తే కార్యానికి, కారణానికి పెద్దగా తేడా లేదు. నిమిత్తమూ, ఉపాదానమూ, కార్యమూ అంతా ఒకటే. కార్యం, కారణం అంటూ రెండు విడివిడిగా లేవు. జీవాత్మ పరమాత్మ వేరు కాదనటానికి ఈ వాదం చాలా ముఖ్యం. నిజంగా పరమాత్మ కారణం, జీవాత్మ కార్యం, అయితే, "కార్య-కారణ అనన్యతా", "సర్వవ్యాపకత్వ వ్యవహారం" ప్రకారం జీవాత్మ పరమాత్మల అంశ ఒక్కటే; ద్వైతం లేదు, భేదం లేదు. – **"నిర్ద్వైతా, ద్వైతవర్జితా, నిర్భేదా, భేదనాశినీ"** అని అమ్మవారి నామాలు. ఎల్లప్పుడూ అభేదమైన సత్యబ్రహ్మను కారణంగాను, మిథ్యా జగత్‌ని కార్యంగాను భావించే ఉహాపోహలు కల్పిత భేదరూపాలు మాత్రమే.

ఉన్నది, ఉంటున్నది, ఉండేది అంతా అనేకరూపాలుగా వివర్తమవుతున్న పరబ్రహ్మమే. "ఏకో దేవః సర్వభూతేషుగూఢః, సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా" – (శ్వేతాశ్వతర 6–10) – ఒకే దైవం అన్ని ప్రాణులయందు దాగుండి, అందరి అంతరాత్మగా అంతట వ్యాపించి ఉన్నాడు. "ఏకం సత్, విప్రాః బహుధా వదన్తి" – (ఋగ్వేదం) – ఉన్నది ఒకటే సత్; అభిజ్ఞులు అనేక రకాలుగా చెప్తూంటారు. "స బ్రహ్మ స శివ స్సహరి స్సేంద్రః సోఽక్షరః పరమస్స్వరాట్" – బ్రహ్మయనో, హరియనో, శివుడనో, ఇంద్రుడనో ఎలా పిలుచుకున్నా సరే, అంతా నాశం లేని ఆ పరమాత్మయే. అమ్మ ఆ **"బ్రహ్మ, జననీ, బహురూపా"**.

బాంక్‌వాళ్ళు వివర్తవాద అద్వైతులు! మనం బాంక్ లోన్ కోసమని బంగారపు వస్తువులు తీసికెళ్ళామనుకోండి. బాంక్ వారు ఆ వస్తువులు వడ్డాణమా, నెక్లెస్సా, ఉంగరమా, అని చూడరు. ఆ వస్తువులు బంగారమేనా, అయితే ఎంత బంగారం అని మాత్రమే చూస్తారు. మూలపదార్థమైన బంగారాన్ని ఇచ్ఛానుసారం రకరకాలుగా మార్చేసే కంసాలి మాత్రం పరిణామవాది. ఆర్టిజాన్లు (కంసాలి, కుమ్మరి, వగైరాలు), ఇంజినీర్లు, టెక్నాలజిస్టులు సాంఖ్యదర్శన మహాపురుషుల వంటివారు.

తాజ్ మహల్ని లక్షలాదిమంది చూస్తూంటారు. చూడగానే, రాత్రింబగళ్ళు సరైన నిద్రాహారాలుకూడా లేక, ఎండా–వాన–చలి పట్టించుకోక, ఎంతోమంది శ్రమకోర్చి కష్టబడితేనే గదా ఈ కట్టడం తయారయింది అనే కార్యకారణ సంబంధం స్ఫురించితే అది కమ్యూనిష్టు దర్శనం. ధారాళంగా సొమ్ములు ఖర్చయితేనే గదా ఇది తయారయ్యింది; దీనికి బదులు ఏ ఇండస్ట్రీయో, ఫాక్టరీయో పెడితే లాభాలైనా వచ్చుండేవి అనుకుంటే అది కాపిటలిస్ట్ దర్శనం. ప్రేమ అంటే షాజహన్‌కి ముంతాజ్ మీద ఉన్నదే ప్రేమ; ఆ కారణంగానే ఇది తయారయ్యింది అనుకుని పాటలూ పద్యాలూ వ్రాస్తే అది కవిదర్శనం. బండగా పడున్న పాలరాయిని ఎంతో మమకారంతో ఇంత బాగా మలవగలిగినందుకే గదా, ఇది తయారయ్యింది అనుకుంటే అది సాంఖ్య దర్శనం. ఓ పరమాత్మా, గతంలో లేక, ఇప్పుడున్నట్లుగా





కనిపిస్తూ, ఇంకెంతకాలం ఇంత అద్భుతంగా కనిపిస్తావో గదా, ఇదంతా ఓ మాయాబజార్, ఓ మయసభ – అనుకుంటే అది అద్వైతం.

మరో ఉదాహరణ: రామాయణ మహాభారతాలు ఇతిహాసాలు; అవి నిజంగా జరిగిన చరిత్రలు. మరైతే అనేక భాషలలో అనేక రకాల రామాయణాలు ఎలా వచ్చాయి? ఒక తెలుగులోనే రకరకాలుగా రామాయణం ఎలా వ్రాయబడింది? కైక దశరథుడిని వరాలు తీర్చమనటానికీ, రాముడు అడవుల పాలవటానికీ, రాముడితోపాటు సీతమ్మ లక్ష్మణులు కూడా పెళ్ళటానికీ, శూర్పణఖ రామలక్ష్మణుల చెంతకి రావటానికీ, ఇంకా ఇంకా ఇలాంటి సంఘటనలకి ఏ కవికి ఆ కవి రకరకాలుగా కార్యకారణాలను కల్పిస్తూ కావ్యాలు వ్రాశారు. జరిగిన చరిత్రని మార్చేయటమన్నది కవులకు కూడా చెల్లదే! నిజంగా జరిగిన చరిత్ర, అసలు కార్యకారణాలూ – తెలవకపోవటంవలన, వాల్మీకిని నమ్మకపోవటం వలన, రామాయణం ఇతిహాసంగా కాక, పురాణంగా తయారయ్యింది.

మన దృక్పథాలనుబట్టి ఇలా రకరకాల కార్య–కారణాలు ఊహించు కుంటున్నాం. ఇదంతా మన హేతుఫలావేశమని, ఆ ఆవేశమున్నంతవరకూ ఏవో కార్యకారణాలుగా అనిపిస్తూనే ఉంటాయని, ఆవేశం నశించినప్పుడు కార్య–కారణ నిర్ముక్తులమవుతామని మాండుక్యకారిక (పైన చెప్పింది). కార్యకారణాలను అన్వేషించవలసిన ఆవేశం కించిత్తైనా లేని ఆ **"నిష్కారణా"** అమ్మవారు **"కార్యకారణనిర్ముక్తా"**.

"ఏకమేవ సదనేక కారణం, కారణాంతర నిరాస కారణం, కార్యకారణ విలక్షణం స్వయం, బ్రహ్మతత్త్వమసి భావయాత్మని" – అనేకత్వానికి కారణమయిన ఒకటే సత్యస్వరూపం, ఏ కారణమూ లేక తనకి తనే కారణమైనది, కార్యకారణములకు అతీతమైన బ్రహ్మతత్త్వము నీవేసుమా, అని గ్రహించమంటూంది వివేకచూడామణి.

ఒక ముఖ్య విషయం: కార్యానికీ కారణానికీ సంబంధం లేదనీ, ఉండి తీరవలసిన అవసరం లేదనీ పైన చెప్పిన వాదనలు పారమార్థిక దృష్టితో చేసినవి. మన నిత్య జీవన వ్యావహారిక దృష్టితో చేసిన వాదనలు కావు. శివుడైనా మాధవుడైనా ఇద్దరూ పరబ్రహ్మ స్వరూపాలేగదా అనుకుని ఏ ఒక్కరినో ఉపాసిస్తే అది పారమార్థికం. కానీ ఉప్పైనా పప్పైనా రెండూ పరబ్రహ్మ స్వరూపాలేగదా అనుకుంటూ ఏ ఒక్కటినో మాత్రమే తినలేం. పప్పు, ఉప్పు సరైన పాళ్ళలో కలిపి ఉడికించిన కారణంగానే భోజనకార్యం సిద్ధిస్తోంది. ఇది వ్యావహారికం.

జీవితంలో మనం ఎందుకు కష్టపడుతున్నామో, ఎందుకు నష్ట పోతున్నామో, ఎందుకు దుఃఖాన్ని అనుభవిస్తున్నామో మనకే అర్థం కాని సందర్భాలను ఎన్నోసార్లు ఎదుర్కుంటూంటాము. ఈ "**కార్యకారణ నిర్ముక్తా**" అనే నామపారాయణ వలన ఆ విశేషాలు మన అవగాహనకు వచ్చి శాంతి లభించగలదు.

ఓం ఐం హ్రీం శ్రీం శ్రీ లలితాంబికాయై నమః.





అధ్యాయము 09

# 9. శ్రీ పుణ్యాపుణ్యఫలప్రదా, శ్రీ లలితాంబికా

పుణ్యఫలప్రదా అనీ, అపుణ్యఫలప్రదా అనీ అర్థం చేసుకోవాలి. సర్వకర్మఫలప్రదా అని దుర్గాష్టోత్తరంలో కూడా ఒక నామం. శ్రీ లలితా సహస్రంలో "**నిష్పాపా**" (పాపములేమీ లేని తల్లీ) అనీ, "**పాపనాశనీ**" (పాపములను నశింపచేయు తల్లీ), "**మహాపాతకనాశనీ**" అనికూడా నామాలున్నాయి. కొన్నింటిని మహా పాతకాలనీ, కొన్నింటిని ఉపపాతకాలనీ, మరి కొన్నింటిని మలినీకరణ పాతకాలనీ శాస్త్రాలలో వివరించారు. దొంగతనం (ముఖ్యంగా బంగారం దొంగిలించటం మహాపాతకం. పశువులకి మేత దొంగిలిస్తే అది దొంగతనమవదు అని శాస్త్రం), సురాపానం (త్రాగి తందనాలు), పరస్త్రీ గమనం, హత్యలు చేయటం – ఈ నాలుగూ మహాపాతకాలని చెప్పి, ఇటువంటి దురాచారాలకు అలవాటు పడిన దుష్టులతో స్నేహం చేయటం మరో మహాపాతకం అని చెప్పారు. ఈ ఐదూ పంచ మహాపాతకాలు. అమ్మ "**దుష్టదూరా**"; అంటే దుష్టులు తన దరిదాపులకు రాకుండా వాళ్ళని దూరంగా ఉంచి, తను కూడా వాళ్ళకి దూరంగా ఉండేది అని అర్థం. అందుకనే ఈశ్వరేచ్ఛ లేనిదే ఈశ్వర ధ్యాస ఉండదు! ఆ "**దురాచారశమనీ**" ఇటువంటి దురాచారాలను శమింపచేస్తూ "**సదాచారప్రవర్తికా**" అవుతున్నది.

"ఆచారస్త్రివిధః ప్రోక్తో వస్తులక్షణ పారగైః, ద్వివిధానామింద్రియాణాం మనసశ్చాపి భేదతః । సచాపి ద్వివిధః ప్రోక్తో భేదాద్విధి నిషేధయోః, ఆచార ఏవ త్యాగోపి నిషిద్ధస్యహి గీయతే । విహితానాం పరిత్యాగం నిందితానాం నిషేవణం, అనాచారం ద్విధా ప్రాహుః సదాచార విదో జనాః । – కర్మేంద్రియ, జ్ఞానేంద్రియ, మనస్సుల భేదాలననుసరించి ఆచారాలు మూడు విధాలు. అవి విధులని, నిషేధాలని మరల రెండు విధాలు. వాటిలో నిషేధాలను వదిలేసి విహితమైనవి మాత్రమే ఆచరించాలి. నిషిద్ధమైనవి వదిలేయకపోయినా, విధులను వదిలేసినా అది అనాచారమవుతుంది.

అయితే పాపాలు, పాతకాలు చేసేసి, ఆ తరువాత, "పాపనాశనీ", "మహాపాతకనాశనీ" అని ఒక నమస్కారం చేసి గట్టెక్కేద్దామంటే మాత్రం సరిపోదు. ఆ తల్లి దయ మనయందున్నంతవరకూ ఆ పాపాలు, పాతకాలూ చేయవలసివచ్చేంత స్థితిగతులను మన జీవితాలలో మనకి రాకుండా నాశనం చేస్తుంది అని మాత్రమే ఈ నామాలకి అర్థం. పుణ్యకర్మలు చేస్తే పుణ్యఫలాన్నీ, అపుణ్య (పాప) కర్మలు చేస్తే పాపఫలాన్ని ఇస్తుంది కాబట్టి ఆమె "**పుణ్యా~పుణ్యఫలప్రదా**" అని చెప్పబడుతూంది. ఆమె "**దండనీతిస్థా**" కూడా కదా! అంటే ఏ శిక్ష ఎప్పుడు ఎవరికి వేయాలో తెలుసున్న "**శ్రీ మహారాజ్ఞీ**".

ఈ శిక్షలగురించి తెలుసుకునే ముందర మరికొంత అవగాహన కావలసివస్తుంది. ధర్మాధర్మాలకీ, పుణ్యాపుణ్యాలకీ అనుసంధానం ఉంది. ధర్మకార్యాలు ఎల్లప్పుడూ పుణ్యఫలాన్నే ఇస్తాయనీ, అధర్మకార్యాలు ఎల్లప్పుడూ పాపఫలాన్నే ఇస్తాయనీ, మనం సహజంగా తలుస్తాం. కానీ ఏది ధర్మమో, ఏది అధర్మమో కూడా తెలియని పరిస్థితులు అనేక సందర్భాలలో మన జీవితాలలో సంభవిస్తూంటాయి. "న ధర్మాధర్మౌ చరత ఆవగ్ం స్వ ఇతి; న దేవగంధర్వా న పితర ఇత్యాచక్షతే, అయం ధర్మః, అయం అధర్మ ఇతి" – అని ఆపస్తంబ ధర్మ సూత్రం. అంటే మనం ఏపనులు చేసినా, వాటంతటవి ఇది ధర్మ కార్యమే అనీ, ఇది అధర్మ కార్యమనీ చాటించుకుంటూ చెప్పలేవు. దేవ గంధర్వ పితృ దేవతలు గూడా చెప్పలేరు – అని అర్థం. "యత్త్వార్యాః క్రియమాణం ప్రశగ్ంసంతి స ధర్మో, యద్గర్హంతే స అధర్మః" – పూజనీయులైన పెద్దవారు మెచ్చుకునేది ధర్మకార్యము, వారు అసహ్యించుకునేది అధర్మము అవుతాయి.

మనం సాధారణంగా ఏ పని చేసినా ఒకటి రెండు ఫలితాలను ఆశించే చేయటం జరుగుతూంటుంది. చదువెందుకూ అంటే ఉద్యోగం కోసం; ఉద్యోగమెందుకూ అంటే సంపాదన కోసం, సంపాదనెందుకూ అంటే పెళ్ళి





చేసుకోవటానికి (లేకపోతే పిల్లనివ్వరు), పెళ్ళి ఎందుకూ అంటే సుఖపడటానికి (పెళ్ళయిన తరువాత సుఖమో, దుఃఖమో దేవుడికే తెలియాలి!), ... చివరకి సుఖపడతామో లేదో, ఫలితం మాత్రం మనం చెప్పలేము. అయినాసరే, ఏదో ఒక ఫలితాన్ని ఆశిస్తూనే మన కార్యాచరణ సాగుతూంటుంది. ఫలితాన్ని ఆశించకుండానే నీ పని నువ్వు చెయ్యి అని శ్రీ కృష్ణ పరమాత్మ భగవద్గీతలో ఎంత మొత్తుకున్నా ఆయన మాట మనకి వంటబట్టదు.

కార్యాచరణ – ఫలసిద్ధి అనే ఈ నేపథ్యంలో కొంత విశ్లేషణ అవసరం. నాలుగు రకాల కార్యాచరణలను ఉదాహరణల సహితంగా పరిశీలిద్దాం. మన ఈ చర్చలో అమ్మవారిగురించి కన్న రామాయణంపై చర్చ ఎక్కువగా ఉంటుంది.

1. మొదటిది: అమ్మవారికి పువ్వులు పెట్టాలి అనిపించింది. కానీ నా దగ్గిర పువ్వులు లేవు. ప్రక్కింటివారి పెరడులోనుంచి రెండు పువ్వులు దొంగతనంగా కోసుకెళ్ళి అమ్మవారికి సమర్పిస్తే సరిపోదూ? అలాగే చేశాననుకుందాం. ఇక్కడ, అమ్మవారికి పువ్వులు సమర్పించటమనే పుణ్య కార్యాచరణ దొంగతనమనే పాపకార్యాచరణతో ముడిపడింది. కానీ ధర్మం (పుణ్యం) కోసం అధర్మం చేయటం జరిగింది.

2. రెండవది: 2–జి యో, 3–జి యో, మరేదో స్కాం. లేకపోతే, మైనింగ్ స్కాం. లేక మరేదో కుంభకోణం! లక్షలకొద్దీ కోట్ల రూపాయిలు దేశాన్నీ, ప్రజలనీ, ప్రకృతినీ మోసం చేసి సంపాదించాం. ఇదంతా పాపార్జన అని మనసు పీకేస్తోంది. ఎలా ఈ పాపాన్ని వదిలించుకోవటం? ఓ వంద కోట్లతో వజ్రకిరీటం ఒకటి చేయించి వేంకటేశ్వరస్వామికి సమర్పించేస్తే సరిపోదూ? అలాగే చేయించి సమర్పించాం అనుకోండి. ఇక్కడకూడా, ధర్మాధర్మాలు (లేక పుణ్యాపుణ్యాలు) ముడిపడి వున్నాయి. చేసిన అధర్మాన్ని అధిగమించటంకోసం ధర్మ కార్యం చేయటం జరిగింది ఇక్కడ.

రామాయణం మరో రెండు సందర్భాలను తెలియచేస్తుంది.

3. మూడవది: రావణుడు సీతమ్మ తల్లితో వాగిన వాగుడంతా చెట్టుపైనున్న ఆంజనేయస్వామి విన్నాడు. "న రామస్తపసా దేవి న బలేన న విక్రమైః, న ధనేన మయా తుల్యః తేజసా యశసాపి వా" – బలపరాక్రమాలలో గానీ, ఐశ్వర్యంలో గానీ, తేజస్సులో, యశస్సులో గానీ, ఆఖరికి తపశ్శక్తిలో గూడా రాముడు తనతో సరితూగలేడని చెప్పుకుంటున్న రావణ ప్రగల్భాలు విన్నాడు. అది దృష్టిలో పెట్టుకుని తరువాత, తరువాత, తనే రావణుడిని కలిసినప్పుడు హనుమంతుడు రావణుడికి చేసిన హితబోధని మనం పరిశీలించాలి.

"తద్భవాన్ దృష్టధర్మార్థః తపఃకృత పరిగ్రహః, పరదారాన్ మహాప్రాజ్ఞ నోపరోద్ధుం త్వమర్హసి, నహి ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు కర్మసు, మూలఘాతిషు సజ్జంతే బుద్ధిమన్తో భవద్విధాః" – ఓ రావణా! ధర్మార్థాలన్నీ తెలిసినవాడివి, తపశ్శక్తి గల్గినవాడివి, ఐనప్పటికీ పరస్త్రీలను అపహరించటం తప్పు పని. ధర్మవిరుద్ధమైన పనులుకి పాల్పడి అసలుకే అపాయాన్ని కొని తెచ్చుకునేలాగ బుద్ధిమంతులు ప్రవర్తించకూడదు సుమా!

"తపస్సంతాపలబ్ధస్తే యోయం ధర్మ పరిగ్రహః, న స నాశయితుం న్యాయ్య ఆత్మప్రాణ పరిగ్రహః, అవధ్యతాం తపోభిర్యాం భవాన్ సమనుపశ్యతి, ఆత్మనస్సాసురైః దేవైః హేతుస్తత్రాప్యయం మహాన్, సుగ్రీవో న హి దేవోయం నాసురో న చ రాక్షసః, న దానవో న గన్ధర్వో న యక్షో న చ పన్నగః, తస్మాత్ ప్రాణపరిత్రాణం కథం రాజన్ కరిష్యసి" – తపశ్శక్తితో సంపాదించుకున్న ఆయుష్షుని ఎందుకు నాశనం చేసుకుంటున్నావు? ధర్మం తెలిసిగూడా ఇలాంటి పాపపు పనులు చేసి ఎందుకు ప్రాణాలమీదకి తెచ్చుకుంటున్నావు? నీ తపశ్శక్తితో నీవు అవధ్యుడవయ్యావని భ్రమపడుతున్నావా? రామ సుగ్రీవుల వల్ల మరణం పొందితీరతావు. నీ తపశ్శక్తి నువ్వుచేసే అధర్మకార్యఫలితాలనుంచి నిన్ను కాపాడలేదు.





రావణుడు తన బల, పరాక్రమ, ఐశ్వర్య, తపో మదాలతో కొట్టుకుంటున్నాడు; తనకి తపశ్శక్తి, ధర్మాచరణ వగైరాలు సమృద్ధిగా ఉండగా, తను చేసే అధర్మ పాపకర్మ ఫలాలు తననేమీ చేయలేవని రావణుడు భ్రమపడుతున్నాడు అన్న హనుమంతుడి ఆలోచన ముఖ్యమైనది. (అనుబంధం చూడండి). రావణవధానంతరం మండోదరి కూడా ఇటువంటి అభిప్రాయాన్నే వ్యక్తపరిచింది. " ...... వీర్యమత్తేన తస్యేదం ఫలమీదృశం" – మహావీరుడవని నీవనుకున్న పొగరుకి తగిన ఫలమే నీ మరణం అని ఏడ్చింది.

ఈ సందర్భంలో కూడా ధర్మాధర్మాలు ముడిపడి వున్నాయి. తాము చేస్తూన్న ధర్మ కార్యాలూ పుణ్యకార్యాల బలంతో, ఎంత అధర్మమైనా పాపమైనా తప్పుపనైనా చేసేదేదో చేసేయవచ్చు అనుకోవటం జరుగుతూంది.

4. నాల్గవది: సీతమ్మ మరో రకమైన సందర్భాన్ని తెలియ చేస్తూంది. ఆమెతో రావణుడు "స్వధర్మో రక్షసాం భీరు సర్వథైవ న సంశయః, గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా" – పరస్త్రీలను అపహరించటం, బలాత్కారం చేయటం మా రాక్షసులకి మామూలే, అది మాకు ధర్మమే అన్నాడు. పైగా, ఇందులో కించిత్ అనుమానం లేదు పొమ్మన్నాడు.

"ఛీ, ఛీ, అసలు ధర్మాధర్మాలంటే ఏమిటో ఈ రాక్షసులకి తెలవనే తెలవవు" అని సీతమ్మ ఈసడించుకుంది.

"ఇహ సన్తో న వా సన్తి సతో వా నానువర్తసే, తథాహి విపరీతా తే బుద్ధిరాచార్యవర్జితా"; "అకృతాత్మానమాసాద్య రాజాన మనయే రతం, సమృద్ధాని వినశ్యన్తి రాష్ట్రాణి నగరాణి చ"; "అకార్యం యే న జానంతి నైరృతాః పాపకారిణః, అధర్మాత్తు మహోత్పాతో భవిష్యతి హి సాంప్రతం, నైతే ధర్మం విజానంతి రాక్షసాః పిశితాశనాః, .. " – "మీ వూళ్ళో నీకు ఈ విషయాలను చెప్పేవారే లేరా? ఎవరైనా చెప్పినా నువ్వు లెక్కబెట్టట్లేదా?

ధర్మాధర్మ విచక్షణ లేకుండా పాపాలకు ఒడిగట్టితే నగరాలూ, దేశాలూ నాశనమైపోగలవు జాగ్రత్త. మహాప్రమాదాలు సంభవిస్తాయి" అని వార్నింగ్ ఇచ్చింది.

రావణుడికి చెప్పేవాళ్ళు లేకనే? విభీషణుడికీ రావణుడికీ పడదు కాబట్టి విభీషణుడు చెప్పిన మాట వినలేదనుకుందాం. "మారీచ కుంభకర్ణాభ్యాం వాక్యం మమ పితుస్తథా న కృతం ..." – ఇష్టమైన మారీచుడు చెప్పలేదా, కుంభకర్ణుడు చెప్పలేదా, లేక నా తండ్రి చెప్పలేదా? నువ్వు వింటేగదా! – అని మండోదరి ఏడ్చింది.

దొంగతనం, హత్యలు, సురాపానం, పరస్త్రీ గమనం, వాలి వంటివారితో స్నేహం – ఈ ఐదు లక్షణాలూ వున్న రావణుడు అన్నివిధాలా మహాపాతకి. (అనుబంధం చూడండి). అందరితోనూ స్నేహం చేయటం అంత మంచి కాకపోవచ్చు. చేసిన పాపం స్నేహితుడితో చెప్పుకుంటే పోతుందని అనుకుంటాం. కానీ విన్నవాడికి కూడా పాపమంటుకోవచ్చు. "కర్తా కారయితా చైవ ప్రేరకశ్చ అనుమోదకః, సుకృతే దుష్కృతే చాపి చత్వారస్సమభాగినః" – చేసినవాడూ, చేయించినవాడూ, ప్రేరేపించినవాడూ, ఆమోదించినవాడు – నలుగురూ కూడా కర్మఫలం సమానంగా అనుభవిస్తారని శాస్త్రం.

ఇక్కడకూడా ధర్మాధర్మాలు ముడిపడి వున్నాయి. ఈ సందర్భంలో, ధర్మమేమిటో అధర్మమేమిటో తెలవని అజ్ఞానం సంభవిస్తుంది.

5. ధర్మాధర్మాలు ఎలా ముడిపడి వుంటాయో నాలుగు రకాలుగా పైన చూశాం. సంక్షిప్తంగా: అధర్మం చేస్తూ ధర్మం కోసం ధర్మకార్యాలు చేయటం మొదటిది; చేసిన అధర్మాన్ని భరించలేక మనశ్శాన్తికోసం ధర్మకార్యాలు చేయటం రెండవది; గతంలో చేసిన ధర్మకార్యాల బలంతో, మదంతో, తెలిసికూడా అధర్మం చేయటం మూడవది (రావణుడి ప్రగల్భాలు); అజ్ఞానంతో అధర్మం చేయటం నాల్గవది (రాక్షసుల గురించి సీతమ్మ అవగాహన).





అధర్మ వాసన లేకుండా ధర్మం కోసమే ధర్మం చేయగలగటం చాలా అరుదైన విషయం. ఫైనల్ జడ్జిమెంట్ ఇక తెలుసుకుందాం. ఈ విషయంలో ఆంజనేయుడూ, మండోదరి మనకి ఆధారం అవగలరు.

"న తు ధర్మోపసంహారం అధర్మఫల సంహితం, తదేవ ఫలమన్వేతి ధర్మశ్చాధర్మనాశనః, ప్రాప్తం ధర్మఫలం తావద్భవతా నాత్ర సంశయః, ఫలమస్యాప్యధర్మస్య క్షిప్రమేవ ప్రపత్స్యసే" – ఓ రావణా, అధర్మఫలంతోగూడిన ధర్మకార్యం అదో ధర్మంగా ఎప్పుడూ ముగింపు చెందలేదు (ఉపసంహారం = ముగింపు, మరలింపు, పరిణామం). అధర్మనాశనం కోసమని చేసిన ధర్మకార్యం కూడా అదే ఫలితాన్ని ఇస్తుంది – అంటే ఆ అధర్మకార్యం ధర్మంగా పరిణతి చెందదు. ధర్మానికి ధర్మఫలితం, అధర్మానికి అధర్మఫలితం తప్పవు. నీవింతవరకూ ఎన్నో ధర్మకార్యాలు చేశావు, నువ్వు ప్రస్తుతం అనుభవిస్తున్న వైభోగమంతా ఆ ధర్మఫలితమే. నువ్వు చేసిన అధర్మకార్యానికి గూడా పాపఫలం తొందరలోనే అనుభవిస్తావు – అని ఆంజనేయుడు రావణుడికి చెప్పిన ధర్మసూత్రం మనం మర్చిపోకూడదు.

మండోదరి రావణుడి మృత్యువుని గురించిన విలాపంలో:
"అవశ్యమేవ లభతే ఫలం పాపస్య కర్మణః, భర్తః పర్యాగతే కాలే కర్తా నాస్త్యత్ర సంశయః, "శుభకృత్ శుభమాప్నోతి పాపకృత్ పాపమశ్నుతే, విభీషణః సుఖం ప్రాప్తః త్వం ప్రాప్తః పాపమీదృశం" – పాపాత్ముడు వాడి కాలం సంభవించగానే పాపఫలం తప్పక అనుభవించితీరుతాడు. శుభాలు చేసినవాడికి శుభఫలం, పాపాలు చేసినవాడికి పాపఫలం దక్కుతాయి అని పుణ్యాపుణ్యఫలాలలోని తేడాలు తెలియచేసింది. ఈ విషయమూ మనం మర్చిపోకూడదు.

6. అనుభవించే కాలం ఎప్పుడు వస్తుంది?
"కీదృశం తు మహాపాపం మయా జన్మాన్తరే కృతం, తేనేదం ప్రాప్యతే ఘోరం మహాదుఃఖం సుదారుణం" – ఏ జన్మలో ఎటువంటి మహాపాపం

చేశానోగదా, ఈ జన్మలో ఈ దారుణమైన భర్తృవియోగం అనుభవిస్తున్నాను అని సీతమ్మ ఏడ్చింది.

ధృతరాష్ట్రుడు జన్మాన్తర రహస్యాలను తెలుసుకోగల్గిన మహా జ్ఞాని. ఆయన కృష్ణ పరమాత్మని అడిగాడుట: "కృష్ణా, 90 జన్మల వెనకవరకూ పరిశీలించాను. ఎప్పుడూ పాపకర్మలను చేసినట్లుగా కనిపించలేదు. నాకు ఈ జన్మలో గ్రుడ్డితనం ఎందుకు వచ్చిందయ్యా?" ఆ పరమాత్మ, "ఇంకొంచెం వెనక్కి వెళ్ళి పరిశీలించుకో, తెలుస్తుంది" అని సలహా ఇచ్చాడు. ధృతరాష్ట్రుడు అలాగే చేయగా క్రితం 94వ జన్మలో చేసిన మహాపాపం వలన ఈ జన్మలో గ్రుడ్డితనం సంభవించిందని తెలుసుకున్నాడుట.

అంటే జన్మ-జన్మాన్తరాల వరకూ శుభమైనా, అశుభమైనా కర్మఫలం అనుభవించక తప్పదు. మరణించిన తరువాతగూడా వ్యక్తిని అనుసరిస్తూండేవి తను చేసిన ధర్మాధర్మాలే (పుణ్యాపుణ్యాలే) గాని, బంధుమిత్రులూ, బ్రతికుండగా సంపాదించిన ఐశ్వర్యాలూ కాదని స్మృతులు చెప్తున్నాయి.

7. కర్మఫలం అనుభవంలోకి ఎలా వస్తుంది?

"యజమానః కృతం పాపం అన్నమాశ్రిత్య తిష్ఠతి", "యజమానః కృతం పాపం ధనమాశ్రిత్య తిష్ఠతి" - అని ధర్మశాస్త్రం చెప్తోంది. యజమాని చేసిన పాపఫలం అతని ఆహారాన్ని (ధనాన్ని) అంటిపెట్టుకుని ఉంటుంది. ఈ దృష్టితోనే కురుక్షేత్ర సంగ్రామానంతరం, "ఇంతమందిని యుద్ధంలో చంపేసి, ఇప్పుడు ఈ రక్తపు కూడు తింటూ రాజ్యాన్ని అనుభవించనా? నాకు అక్కర్లేదు ఈ రాజ్యం" - అని ధర్మరాజు పెద్దగొడవ చేశాడు. ఈ యుద్ధంలో ఏ పాపం జరగలేదని వాదించి, నచ్చజెప్పి, ఆయనని పట్టాభిషేకానికి ఒప్పించటానికి దేవుడూ బ్రహ్మర్షులూ (కృష్ణ పరమాత్మ, వ్యాసుడు) దిగిరావలసి వచ్చింది.

సాధారణంగా అన్నాన్ని మనమైనా ఆరగిస్తాము, లేక మరెవరికైనా పెడతాం. పాపార్జనతో కూడిన ఆహారం మనమే తీసుకున్నప్పుడు తిన్నది





పడక రోగాలూ రొచ్చులూ రావటం జరగవచ్చు. ఎవరికైనా పెట్టినట్లైతే, ఆ అన్నం తీసుకున్నవాడికి పాపఫలం అంటుకుంటుందిట. "అతిథిశ్చ అపవాదీ చ ద్వే యేతే మమ బాంధవౌ" - అని సూక్తి. మనమీద నీలాపనిందలు వేసేవాడూ, చెప్పి పెట్టకుండా మనింటికి వచ్చి భోజనం చేసి మాయమైపోయేవాడూ - ఈ ఇద్దరినీ మన పాపప్రక్షాళణం చేయగల బంధువులుగా గుర్తించమన్నారు. (తిథులతో సంబంధం లేకుండా, అంటే వేళా-పాళా లేకుండా వచ్చేవాడు "అతిథి".) అందుకని, అపాత్రులకి దానం ఎలా ఈయకూడదో, అలాగే అపాత్రులనుంచి గ్రహణం కూడా ప్రమాదకరం కావచ్చు.

ధర్మశాస్త్రం ఇంకా ఘోరంగా కూడా చెప్పింది: "యజమానః కృతం పాపం ప్రజామాశ్రిత్య తిష్ఠతి" - మనం చేసే పాపాలన్నీ మన సంతానాన్ని కూడా పట్టుకుంటాయి. పిల్లలున్న కుటుంబాలలో పాపభీతి ఎక్కువగా ఉంటుంది. దానికి కారణం ఈ ధర్మసూత్రం.

8. దైనందిక జీవితంలో మనం ఎన్నో పనులు చేస్తూంటాం. ఏది పుణ్యకార్యమో, ఏది పాపకార్యమో తెలుసుకోలేని పరిస్థితులు మనవి. తెలుసుకోగలిగినా పాపభీతి తక్కువైపోతున్న కాలం మనది. కానీ ఎప్పుడో ఒకప్పుడు ఫలితం అనుభవించి తీరవలసిందేనని శాస్త్రాలూ, పురాణాలూ, ఇతిహాసాలూ తెలియచేస్తున్నాయి. ఏది పుణ్యమో ఏది పాపమో తెలిసిన అమ్మ శ్రీమాత "**పాపారణ్య దవానలా**" - అంటే పాపమనే అరణ్యాన్ని దహించేసే దావానలం. పుణ్యానికి పుణ్యఫలం, పాపానికి పాపఫలం సిద్ధంపజేసే ఆ "**పుణ్యాపుణ్యఫలప్రదా**" లలితాంబికకు నమస్కారం.

ఓం శ్రీ పుణ్యా~పుణ్యఫలప్రదాయై నమః,
ఓం ఐం హ్రీం శ్రీం లలితాంబికాయై నమః.

---

అనుబంధం

3. రావణుడిని అర్థం చేసుకోవటంలో హనుమంతుడి ఆలోచనలు వివిధరకాలుగా ఉన్నాయి. (i) రావణుడు తన బల, పరాక్రమ, ఐశ్వర్య, తపో మదాలతో కొట్టుకుంటున్నాడు; తనకి తపశ్శక్తి, ధర్మాచరణ వగైరాలు సమృద్ధిగా ఉండగా, తను చేసే అధర్మ పాపకర్మ ఫలాలు తననేమీ చేయలేవని రావణుడు భ్రమపడుతున్నాడు అన్న ఆలోచన ముఖ్యమైనది. (ii) అతను వరాలను కోరుకున్నప్పుడు నర-వానరులచేత తనకి ఆపద రావటం అసంభవం అనుకున్నాడు. ఇప్పుడు నర-వానరులైన రామ-సుగ్రీవుల వలనే ఆపద వస్తూంది. (iii) రావణుడి బలపరాక్రమాలను ఎదుర్కొని వాడి అంతు చూడటానికి దేవ-దేవతా-గంధర్వాదులు అక్కర్లేదు, నర-వానరులు చాలు.

4. "స్వధర్మో రక్షసాం భీరు సర్వథైవ న సంశయః, గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా" అని రావణుడు సీతమ్మతో చెప్పిన మాట ఆంజనేయుడూ విన్నాడు గదా! ఐనప్పటికీ తను రావణుడిని "దృష్టధర్మార్థః తపఃకృత పరిగ్రహః" అని ఎలాగ అనగలిగాడు? సీతమ్మ మాత్రం, "ధర్మాధర్మాలంటే ఏమిటో ఈ రాక్షసులకి తెలవనే తెలవవు" అని ఈసడించుకుంది. రాక్షసుల ధర్మం సీతమ్మకి ధర్మం అవనక్కర్లేదు.

రావణుడిని ట్రీట్ చేసే విషయంలో సీతమ్మ తల్లి ఆంజనేయుడికన్న ఓ మెట్టు పైనే ఉన్నట్లుగా తోస్తుంది! "అహో రూపం, అహో ధైర్యం, అహో సత్త్వం, అహో ద్యుతిః, అహో రాక్షసరాజస్య సర్వలక్షణ యుక్తతా" అంటూ ఆంజనేయుడు రావణుడిని చూసి ఆశ్చర్యపడటమేగాక, "భవాన్ దృష్ట ధర్మార్థః తపఃకృత పరిగ్రహః" అని సంబోధించాడు. సీతమ్మ మాత్రం రావణుడిని ఓ మహాపాతకిగా, ధర్మాధర్మాలు తెలవని ఓ అజ్ఞానిగా, "తృణమంతరతః కృత్వా" - ఓ గడ్డిపోచగా భావించి, "రాక్షసం పృష్ఠతః కృత్వా" - తన ముఖం కూడా రావణుడికి కనిపించకుండా మాటలాడింది. పైగా, "శక్యా లోభయితుం నాహమైశ్వర్యేణ ధనేన వా" - నీ ధన ఐశ్వర్యాలతో నన్ను లొంగదీసుకోలేవు అని తెగేసి చెప్పింది.





*****

సర్వ మంగళ మాంగల్యే శివే సర్వార్థ సాధికే,
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తు తే ।

ఓం శాన్తిశ్శాన్తిశ్శాన్తిః.

*****

Some reference books of recent times:

1. Markandeya Sarma Kanuparti (1934): Taittiriyopanishat – Andhra TikA Tatparya Svara Sahitamu; Vavilla Ramaswami Sastrulu & Sons, Chennapuri.

2. Ramaswami Sastrulu Vavilla (Ed.) (1954): Ashtottara Satopanshadaha; Vavilla Ramaswami Sastrulu & Sons, Chennapuri.

3. Sundara Rama Sarma Vennelakanti (….): Brahma Sutra Artha Chandrika.

4. Russell Bertrand (1968): The Conquest of Happiness; Bantam Book, Liveright Publishing Corporation, New York.

5. Russell Bertrand (2000): History of Western Philosophy; Routledge, Taylor & Francis Group, London & New York.

6. Vireswara Sarma Rayasam (2002): Chandogyopanishat – Sankara Bhashya Sahita Anuvadamu; Sri Sitarama – Adi Sankara Trust, Hyderabad.

7. Schotsman Irma (2005): Laghu Yoga Vasishtha; Nag Publishers, Delhi.

8. Stokes Philip (2010): Philosophy – 100 Essential Thinkers; Arcturus Publishing Limited, London.

9. Nanduri Rama Mohana Rao (2012): Viswadarsanam _ Bharatiya Chintana; Sri Venkateswara Book Depot, Vijayawada.

10. Nanduri Rama Mohana Rao (2012): Viswadarsanam _ Paschatya Chintana; Sri Venkateswara Book Depot, Vijayawada.

11. Wittkower D E (2013): The Philosopher's Book of Questions & Answers; Adams Media, Avon, MA 02322, USA.

12. Many other books including those published by Sri Ramakrishna Math, Madras.







N.S.S. Narayana received his early education from Andhra Geervana Vidya Peetham, Kovvur (A.P.). He did B.E. (mechanical) at Andhra University, Waltair, Ph.D. (economics) at Indian Statistical Institute, Delhi Centre, and also M.A. (Sanskrit) from KSOU, Mysore.

Dr. Narayana worked in the Planning Commission, New Delhi, Madras University, Chennai and International Institute for Applied Systems Analysis, Laxenburg (Vienna). He is Professor (Retd.) of Economics at Indian Statistical Institute, Bangalore Centre. He published several research papers in national and international journals. His academic interests include Computable General Equilibrium models, Planning models, Agricultural economics, Econometric applications, Time series analysis and Indology.

-----------------------------------------------------------------------------------------

**Srimaata Nisseema Mahima - 2 (2014) Rs.60/-**



Prof. N.S.S.Narayana
12-3-18, Satya Vilas
MuDu Dabaala Veedhi
Kovvuru - 534350 (W G Dt. A.P.)
M: 09448122118